# పట్టుకోండి
# మీ నేస్తాన్ని
# మాయమయే
# ముందే.

ఈ హ్యాండిబాయ్ ఓ
అయస్కాంతం.
హ్యాండిప్లాస్ట్ (ఫ్రీస్) 25 గల
ప్యాక్‌లో ఉచితంగా దొరుకుతాడు...
అంతేకాదు అద్భుతాలు చేయగలడు.
మీ ఫ్రిజ్, స్టీల్ బీరువాకి
అతుక్కుపోతాడు. మీ చిత్రాలను
కార్డులను పైకెత్తి
పట్టుకోగలడు.
ఒకవేళ హ్యాండిప్లాస్ట్ ప్యాక్‌ని
ఇప్పుడే కొనమని మీరుగానీ
మీ అమ్మను ఉక్కిరిబిక్కిరి
చేయకపోతే హ్యాండిబాయ్
మరో అద్భుతం చేసేస్తాడు
మాయమయిపోతాడు...
అంతే.
త్వరపడండి!
మీ హ్యాండిబాయ్
అయస్కాంతాన్ని నేడే
అందుకోండి.
సరుకు
ఉన్నంతవరకే
ఈ సదుపాయం.

## ఉచితం!
హ్యాండిబాయ్ అయస్కాంతం
ప్రతి 25 గం ప్యాక్‌తో.




హ్యాండిప్లాస్ట్ ఈ సదుపాయం లేకుండా కూడా దొరుకుతుంది.

HTA 1549



# చందమామ

సెప్టెంబర్ 1989



ఈ సంచికలో కథలు - వింతలు - విశేషాలు






విడి ప్రతి: 3-00

సంవత్సర చందా: 36-00




# చందమామ

సంస్థాపకుడు : 'చక్రపాణి'
సంచాలకుడు : నాగిరెడ్డి

---

ఈ నెల బేతాళకథ [గానపిశాచి]కి ఆధారం, జొన్నలగడ్డ రామలక్ష్మి రచన. ఒక పనిని ఎవరికి అప్పగిస్తే జయప్రదంగా సాధించగలరో గ్రహించి, అటువంటి సమర్థులకు ఆ పనిని అప్పగించడంలోనే విజయ రహస్యం ఇమిడి ఉన్నది. ''కార్యసాధకుడు'' అన్న కథలో ఈ విషయం తెలుసుకుంటాం.

## అమరవాణి

హస్తీ హస్త సహస్రేణ, శతహస్తేన వాజినః
శృంగిణో దశహస్తేన, స్థాన త్యాగేన దుర్జనః.

[ఏనుగుకు వెయ్యిమూరల దూరంలోనూ, గుర్రానికి వంద మూరల దూరంలోనూ, కొమ్ములుగల ప్రాణికి పదిమూరల దూరంలోనూ ఉండడం క్షేమం. అయితే, దుర్జనులున్న ప్రాంతాన్ని వదలిపెట్టడమే క్షేమకరం!]

---

సంపుటి 85 సెప్టెంబర్ '89 సంచిక 3

విడి ప్రతి : 3-00 : : సంవత్సర చందా : 36-00

# మీ పాపాయికి
# అందించండి సెరిలాక్ లాభం



## తొలిసారిగా ఘన పదార్థాలను ఇస్తూ

4 నెలల నుంచీ మీ పాపాయికి, పాలతోబాటు ఘన పదార్థాలు కావాలి. సెరిలాక్ లాభాన్ని అందించండి.

పోషకాహార లాభం : సెరిలాక్ ప్రతి మోతాదులోనూ మీ పాపాయికి కావలసిన పోషక పదార్థాలు, ప్రొటీన్లు, కార్బోహైడ్రేట్లు, కొవ్వు పదార్థాలు, విటమిన్లు, ఖనిజాలూ అన్నీ వున్నాయి. అన్నీ సమ పాళల్లో వున్నాయి.

రుచి లాభం : పాపాయిలకు సెరిలాక్ రుచి ఇష్టం.

సమయం ఆదా లాభం : సెరిలాక్ ముందుగా వండినది. దానిలో పాలూ, పంచదార వున్నాయి. దానికి వెచ్చటి నీటితో కలిపితే చాలు.

ఎంపిక లాభం : ఎంచుకునేందుకు మూడు రకాల సెరిలాక్ వుంది.

మీ పాపాయికి సమతూకంలో పోషకాహారాన్ని అందించేందుకూ, తయారుచేయటంలో పరిశుభ్రతను పాటించేందుకూ, డబ్బా మీది సూచనలను జాగ్రత్తగా పాటించండి.




6 మాసాలు నించి




4 మాసాలు నించి




6 మాసాలు నించి

ఉచితం
సెరిలాక్ బేబీ కేర్ బుక్
వ్రాయండి.సెరిలాక్
పోస్ట్ బాక్స్ నెం 3
న్యూ ఢిల్లీ 110008




## సెరిలాక్ రక్షణ: పోషకాహారంతో పరిపూర్ణం-ఎంతో రుచికరం

RK SWAMY/FSL/5112/TEL

# చందమామ కబుర్లు




## పురాతనకాలం నుంచి పూస్తున్న పువ్వులు!

పదికోట్ల సంవత్సరాలకు పూర్వం నుంచి పువ్వులు పూస్తున్నట్టు ఇంతవరకు విశ్వసించేవారు. అయితే, ఇటీవల జర్మను శాస్త్రవేత్తలు—భూమిమీద 300,000,000 సంవత్సరాలకు పూర్వం నుంచే పువ్వులు పూస్తున్నవని రుజువు చేశారు.

## నాగసర్పానికి స్వాగతం!

జైనులు నాగసర్పాన్ని అదృష్టదేవతగా భావిస్తారు. ధన్‌బాద్ సమీపంలో నిర్మించిన భగవాన్ పరేశ్‌నాథ్ ఆలయ ప్రారంభోత్సవ సమయంలో, ఆలయగోపురం మీద పదడుగుల నాగసర్పం చేరి, ఆ కార్యక్రమం పూర్తయ్యేంతవరకు పడగవిప్పి ఆడడం చూసి, వేలాదిభక్తులు పరవశం చెందారు.





## సుప్రసిద్ధ కథానాయకుడు!

యునెస్కో వెలువరించిన వివరాలనుబట్టి ప్రపంచంలోకెల్లా ఎక్కువ భాషలలోకి అనువదింపబడిన పుస్తకం—మికీమౌస్ సాహసాలు. రెండవస్థానాన్ని లెనిన్ గ్రంథాలు ఆక్రమిస్తున్నవి. మూడవస్థానం అగాథాక్రిస్టీ కథలూ, నాల్గవస్థానం బైబిలూ అలంకరిస్తున్నవి.

## అతిచిన్న కంప్యూటర్

ఒక అంగుళం మందం కూడా లేని పాకెట్‌బుక్ వంటి చిన్న కంప్యూటర్ ఇటీవల రూపొందించబడింది. సాధారణంగా బల్లమీద ఉంచేంత సైజుగల కంప్యూటర్ చేసేపనిని ఈ చిన్న కంప్యూటర్ చేస్తుంది!



# ఉమ్మడి చెప్పులు

ఇద్దరు పరమపిసినిగొట్టులు, నగరంలో ఒక ఇల్లు అద్దెకు తీసుకుని, అందులో వుంటున్నారు. వాళ్ళల్లో ఒకడిది, గాజులమ్మే వ్యాపారం. రెండోవాడిది, వస్తువులను కుదువపెట్టుకుని డబ్బిచ్చే తాకట్టు వ్యాపారం. ఒకనాడు గాజులమ్మేవాడు, తాకట్టు వ్యాపారితో, "మనిద్దరం చెరిసగం డబ్బువేసి, ఒక చెప్పుల జత కొందాం," అన్నాడు.

"అదేం బావుండదు. నువ్వొక చెప్పూ, నేనొక చెప్పూ తొడుక్కుని వీధిలోకి పోతే జనం నవ్వుతారు," అన్నాడు తాకట్టువ్యాపారి.

"చెప్పుల జత ఉమ్మడిదైనా, మనం చెరొక చెప్పూ తొడుక్కోనవసరం లేదు. వ్యాపారం పని మీద ఎవరు బయిటికి వెళితే, వాళ్ళు చెప్పుల జతను తొడుక్కుపోవచ్చు," అన్నాడు గాజులవ్యాపారి.

ఈ పద్ధతి బావున్నదనిపించింది, తాకట్టువ్యాపారికి. ఇద్దరూ కలిసి ఒక చెప్పుల జత కొన్నారు. గాజులవ్యాపారి వాటిని తొడుక్కుని గాజులమలారం భుజానికి తగిలించుకుని నగరంలో తిరుగుతూ గాజులమ్ముకునేవాడు. తాకట్టువ్యాపారి ఇంటివసారాలో కూర్చుని, అవసరంపడి వచ్చినవాళ్ళ వస్తువులు తాకట్టుపెట్టుకుని డబ్బిచ్చి పంపుతూండేవాడు. ఇందువల్ల అతనికి, చెప్పులజతలో సగంభాగం వున్నా తొడుక్కు తిరిగేందుకు అవకాశం వచ్చేదికాదు. ఇది అతడికి పెద్ద విచారకారణం అయింది.

బాగా ఆలోచించిన మీదట, తాకట్టువ్యాపారికి ఒక ఉపాయం తోచింది. అతడు రాత్రివేళ గాజులవ్యాపారి నిద్రపోతున్న సమయంలో చెప్పులు తొడుక్కుని తెల్లవారేదాకా ఇంటిచుట్టూ తిరగసాగాడు. కొద్దిరోజుల్లోనే చెప్పులు బాగా చిరిగిపోయినై.

"కొత్తచెప్పులు కొందాం," అన్నాడు గాజులవ్యాపారి.

"ఆనలేనాడూ, చెప్పులమాటే ఎత్తగూడదు," అన్నాడు తాకట్టువ్యాపారి.

"ఎందుకని?" అంటూ గాజులవ్యాపారి ఆశ్చర్యపోయాడు.

"రాత్రిళ్ళు నిద్రలేకుండా ఎన్నాళ్ళుండగలను? నేను నిద్రపోవాలి!" అన్నాడు తాకట్టు వ్యాపారి.





# తాడిచెట్టుకిందపాలు

ఒకానొకప్పుడు రత్నగిరి నగరంలో, కుబేరుడనే వ్యాపారి వుండేవాడు. ఆయనకు కాలం, కర్మం కలిసిరాక వ్యాపారంలో విపరీతంగా నష్టపోయాడు.

ఈ పరిస్థితుల్లో, ఏమి చేయడమా అని కుబేరుడు ఆలోచిస్తూండగా ఒక జ్యోతిష్కుడు ఆయనతో, "ప్రస్తుతానికి ఈ నగరం నీకు అచ్చిరాదు. నువ్వు సముద్రయానం చేసి విదేశాలకు వెళ్ళి, అక్కడ ఏదైనా వ్యాపారం చేస్తూ కొంతకాలం వుండి తిరిగిరా. నీ దశ తప్పక మారుతుంది," అని సలహా ఇచ్చాడు.

కుబేరుడికి ఒక్కగా నొక్క కొడుకు సమీరుడు. వాడికి ఎలాంటి చెడు బుద్ధులు లేవు కానీ, ఎక్కువగా తాగుబోతులతోనూ, జూదరులతోనూ తిరుగుతూండేవాడు.

తను సముద్రయానానికి వెళ్ళేముందు, కుబేరుడు కొడుకును పిలిచి, "నాయనా నేను ఏదైనా వ్యాపారం చేయాలన్న ప్రయత్నంలో విదేశాలకు వెళుతున్నాను. నేను తిరిగివచ్చేదాకా యిక్కడ మనకున్న చిన్న వ్యాపారాన్ని శ్రద్ధగా చూసుకుంటూ, అమ్మకు ఏలోటూ రానీయకు," అన్నాడు.

సమీరుడు సరేనన్నాడు. కుబేరుడు అంతటితో తృప్తిపడక, "నువ్వు బుద్ధిమంతుడివని నాకు తెలుసు. కాని చెడు సావాసం మంచిదికాదు. నువ్వు తాగుబోతులతోనూ, జూదరులతోనూ తిరగకు," అని చెప్పాడు.

సమీరుడు, తండ్రి మాటలకు ఆశ్చర్యపోయి, "ఇన్నాళ్ళూ లేనిది యీ రోజున, యీ విషయం నాకెందుకు చెబుతున్నారు? ఇందుకేమైనా ప్రత్యేక కారణం వున్నదా?" అని అడిగాడు.

"అవును నాయనా, కారణం వుండబట్టే, యీ విషయం చెప్పవలసి వచ్చింది,

"వసుంధర"




ఇన్నాళ్ళూ నువ్వు చిన్నవాడివి. ఈనాడు ఇంటి పెత్తనం నేను, నీకప్పగించగానే పెద్దవాడివయ్యావు. అందువల్లనే, సంగతి చెప్పి నిన్ను హెచ్చరించవలసి వచ్చింది,'' అన్నాడు కుబేరుడు.

ఇందుకు సమీరుడు, ''నాన్నగారూ! నేను చెడుసావాసాలు చేయడానికి కొన్ని కారణాలున్నాయి. వాళ్ళందరూ నా చిన్ననాటి స్నేహితులు. చిన్నప్పుడందరం కలిసి హాయిగా తిరుగుతూండేవాళ్ళం. పెద్దయ్యాక అలవాట్లపేరు చెప్పి, వాళ్ళకు దూరం కావడం స్నేహధర్మానికి విరుద్ధం. ఇది మొదటి కారణం! వాళ్ళతో పోల్చితే నేను చాలా బుద్ధిమంతుణ్ణి. వాళ్ళెప్పుడూ నన్ను పొగడుతూంటారు. చెడ్డ అలవాట్లు నాకు లేనందుకూ, చెడిపోయినా వాళ్ళ స్నేహం వదలనందుకూ, రోజూ వాళ్ళు నన్ను మెచ్చుకుంటూంటే, నాకెంతో సంతోషంగా వుంటుంది. ఇది రెండో కారణం! అలాంటివాళ్ళతో తిరిగితే, ఏదో ఒక రోజున నేనూ చెడిపోతానని చాలా మంది పందాలు కట్టారు. అది తప్పని ఋజువుచేయడం కోసం నేను వాళ్ళతో ఎక్కువగా తిరుగుతున్నాను. ఇది మూడో కారణం!'' అన్నాడు.

కుబేరుడు నవ్వి, ''నువ్వు చెప్పింది బాగానే వుంది. ఇంతకాలం వాళ్ళతో తిరిగావుగదా, అది చాలు. సమాజంలో నీ హోదా నీ స్నేహితుల్నిబట్టి వుంటుంది. ఇప్పుడు ఇంటి పెద్దవయ్యావుకాబట్టి, ఇక మీదట చెడుసావాసాలు వదులుకో. తాడి చెట్టుకింద పాలు తాగితే ఏమవుతుందో నీకు తెలుసుగా!'' అన్నాడు.

తాడి చెట్టుకింద పాలుతాగితే ఏమవుతుందో, సమీరుడికి తెలియదు. కానీ తెలియదంటే, ఈమాత్రం నీకు తెలియదా అని తండ్రి అంటాడని, వాడేమీ అయన్నడగలేదు.

కుబేరుడు విదేశాలకని బయల్దేరి వెళ్ళాక, ఒక రోజున సమీరుడొక్కడూ ఒక లోటాలో పాలు పోసుకుని వెళ్ళి,



ఊరిచివర తాడిచెట్టుకింద కూర్చుని పాలు తాగసాగాడు. అందువల్ల పాల రుచిలో ఏమార్పూ లేకపోవడంతో, "నాన్నగారలా ఎందుకన్నారోమరి ? తాడిచెట్టుకింద తాగినా, పాలు పాలులాగే వున్నాయి." అనుకున్నాడు.

అయితే, సమీరుడు తాడిచెట్టుకింద కూర్చుని పాలు తాగడం, తెలిసినవాళ్ళెవరో చూసి, వాడి తల్లితో, "మీ అబ్బాయి ఊరిచివర తాడిచెట్టుకింద కూర్చుని కల్లు తాగుతున్నాడు. చెడుసావాసాలు చేస్తే ఊరికే పోతుందా ? ఇన్నాళ్ళూ తండ్రి ఇంట వున్నాడని భయపడినట్టున్నాడు. ఇప్పుడు అదుపు చేయగలవాళ్ళెవరూ లేరు. ఇక ఒక్కొక్క చెడుగుణం బయట పడుతుంది." అని చెప్పారు.

ఇది వింటూనే సమీరుడి తల్లి లబో దిబోమంటూ ఏడవసాగింది. ఎవరో వెళ్ళి, ఇంకా చెట్టుకిందే కూర్చునివున్న సమీరుడికి, యీ విషయం చెప్పారు.

"నేను తాగుతున్నది కల్లు కాదు, పాలు," అన్నాడు సమీరుడు కబురు తెచ్చిన మనిషితో.

"ఓహో, అలాగా!" అంటూ ఆ మనిషి నవ్వి అక్కణ్ణించి వెళ్లిపోయాడు.

అప్పటికి సమీరుడి లోటాలో యింకా కొద్దిగా పాలున్నవి. తను తాగింది పాలే అని తల్లికి ఋజువు చూపించడానికి, వాడా పాలు తీసుకుని ఇంటికి వెళ్ళాడు.

వాడి తల్లి ఇంకా దుఃఖపడుతూనే వున్నది. సమీరుడు ఆమెకు జరిగిందేమిటో చెప్పజూశాడు. కానీ ఆమె ఆ మాటలేం వినకుండా, "ఇంతకాలం నీకు చెడు సావాసాలే వున్నవనుకున్నాను. నువ్వే చెడిపోయావని ఈ రోజే తెలిసింది." అన్నది.

"అమ్మా, ఈ లోటాలో వున్నది కల్లు కాదు, పాలు. కావాలంటే నువ్వే చూడు," అన్నాడు సమీరుడు తల్లితో.

"నేనేం చూడక్కర్లేదు. పాలుతాగేందుకు తాడిచెట్టుకిందికి వెళ్ళి కూర్చో

వాలా? ఇంట్లోనే తాగొచ్చుగదా! ఆపాటి బుద్ధి కూడా లేదా నీకు?'' అన్నది తల్లి.

''ఆలోచించకుండా చేశాను, పొరబాటై పోయిందమ్మా, ఇంకేనాడూ యిలా చేయను. ఇదుగో, ఇంట్లోనే తాగుతున్నాను, చూడు!'' అంటూ సమీరుడు మిగతా పాలు అక్కడే తాగబోయాడు.

సమీరుడి తల్లి చటుక్కుని వాడి చేతి లోంచి లోటా లాక్కుని, దూరంగా విసిరి వేసి, ''అంతగా కల్లు తాగాలనుంటే, ఆ తాడిచెట్టుకిందికే పోయి తాగు. ఇంట్లో తాగితే నేను సహించేదిలేదు,'' అన్నది.

''ఆ లోటాలో వున్నది కల్లుకాదు, పాలని చెబితే వినవేంటమ్మా!'' అన్నాడు సమీరుడు చిరాగ్గా.

ఇంతలో ఒక పిల్లి అక్కడికి వచ్చి, కిందపడిన లోటాలోంచి ఒలికిన పాలను నాకింది. దానికేమయిందోగాని, అంత వరకూ మామూలుగా నడుస్తున్నదల్లా తూలుకుంటూ అక్కడినుంచి వెళ్ళి పోయింది.

వాడితల్లి అది చూసి, ''ఒరే, ఆలోటాలో వున్నది కల్లుకాదు పాలని యింకా నమ్మ మంటావా?'' అని అడిగింది.

ఏం జవాబు చెప్పాలో తోచక, సమీరుడు తలవంచుకున్నాడు.

అప్పుడు వాడి తల్లి కళ్ళు తుడుచు కుని, ''మీ నాన్నగారు ప్రారంభంలోనే నిన్ను గట్టిగా కోప్పడి, సరైన మార్గంలో పెడితే, నీకా జూదరులా, తాగుబోతులా స్నేహంవల్ల, ఈ పాడుబుద్ధులబ్బేవికాదు. మీ నాన్నగారు, నిన్నీ ఇంటికి పెద్దను చేసి వెళ్ళారు. ఇకనైనా దురభ్యాసాలకు దూరంగా వుంటూ, ఉన్న వ్యాపారాన్ని జాగ్రత్తగా చూసుకో,'' అన్నది.

ఆ మాటలతో సమీరుడికి, తాడిచెట్టు కిందికి తీసుకువెళ్ళాక పాలను, కల్లు కాదని నమ్మించడం ఎంత కష్టమో అర్థ మయింది. దానితో వాడికి, తండ్రిమాటల్లోని అంతరార్థం బోధపడి చెడుసావాసాలు వదిలిపెట్టి, వ్యాపారం చేసి, నలుగురి లోనూ మంచిపేరు తెచ్చుకున్నాడు.





# బందిపోటు యువరాజు

పచ్చగా కళకళలాడే కొండలకు దిగువన ఉన్న శాంతిపురం, పేరుకు తగ్గట్టు ఎంతో ప్రశాంతమైన నగరం. ఆ నగరం సుమేధ రాజ్యానికి రాజధాని. ఇంతవరకు సుమేధ రాజ్యాన్ని పరిపాలించిన రాజులు, ఆ నగరాన్ని శోభాయమానంగా తీర్చిదిద్దడానికి, ఆలయాలు నిర్మించారు; ఉద్యానవనాలు ఏర్పరచారు; తటాకాలు తవ్వించారు. ప్రస్తుతం సుమేధను పరిపాలిస్తున్న రాజు శాంతిదేవుడు. నగర ప్రజలేగాక, రాజ్యంలోని ప్రజలందరూ సుఖశాంతులతో, సిరిసంపదలతో తులతూగడానికి కృషి చేస్తున్నాడు.

ఈ విషయం గురించి మాట్లాడుతూ ఒకనాడు సేనాధిపతి వీరసింహుడు రాజుతో, "రాజ్యంలో సంపదలు పెంచడానికి, పొరుగురాజ్యంపై దండెత్తడమే సులభ మార్గం, మహారాజా! ఒక్కదెబ్బతో రాజ్య విస్తరణతోపాటు, ఆ రాజ్యంలోని సంపదలన్నీ మన వశమవుతాయి," అన్నాడు.

అందుకు రాజు చిన్నగా నవ్వి, "వీరసింహా, అది సరైనమార్గం కాదు. పొరుగురాజ్యాన్ని కొల్లగొట్టి సంపాదించే ధనం అట్టేకాలం నిలవదు. పైగా అది సులభంగా లభ్యమవుతుంది కాబట్టి, ఆపైన మన ప్రజలు కష్టపడి పని చేయరు. దోచుకున్న ధనం అయిపోయాక, వేరొక రాజ్యంపైబడి దోచుకోవాలని బుద్ధిపుడుతుంది. యుద్ధంలో ఎప్పుడూ మనమే విజయం సాధించగలమన్న నమ్మకం



ఏమిటి? మనం ఓడితే శత్రువులు మనల్ని దోచుకుంటారు. ఒకవేళ మనమే గెలిచినప్పటికీ, ఓడిపోయిన రాజులు మన మీద పగసాధించడానికి అదునుకోసం ఎదురు చూస్తుంటారు. ఆ పరిస్థితిలో శాంతి అసాధ్యం కదా!'' అన్నాడు.

''యుద్ధం వద్దంటే మరి మనకు సైనిక బలం దేనికి మహారాజా?'' అన్నాడు వీరసింహుడు.

''పరులదాడినుంచి మనల్ని రక్షించుకోవడానికి మనకు సైనికబలం అవసరం. అయితే, యుద్ధకారణంగా వాటిల్లే అనర్థాలను రాజులందరూ గ్రహించి సైన్యాలను రద్దు చేయాలన్నదే మన ఆశయం. యుద్ధంవల్ల వాటిల్లే అపారజననష్టం, ధననష్టం, కాలవ్యయం నీకు తెలియనిది కాదు. అసలు యుద్ధాలే లేకుంటే వీటినన్నిటినీ ప్రజోపయోగ కార్యక్రమాలకు వినియోగించవచ్చు కదా?'' అన్నాడు శాంతిదేవుడు.

''ప్రభువులు క్షమించాలి. తమరు కలలు కంటున్నారు!'' అన్నాడు వీరసింహుడు హేళనగా.

సేనాధిపతి వీరసింహుడు రాజుకు దగ్గరిబంధువే కాక, బాల్యం నుంచి ఇద్దరూ కలిసిమెలిసి తిరిగినవారు. ఆ కారణంగా వీరసింహుడు రాజుతో చాలా చనువుగా మాట్లాడ కలిగేవాడు.

''నిజమే వీరసింహా, నేను కలలు కంటున్న మాట వాస్తవం. కపటంతో ఒకరి గొంతును మరొకరు కోయడంలో పోటీపడుతూ కాలం గడపకుండా, మాయ మర్మాలు లేకుండా ఒకరి మంచిలో మరొకరు ఆనందపడుతూ ప్రజలందరూ హాయిగా జీవించే అద్భుత ప్రపంచం కోసం కలలు కంటున్నాను. అందుకే, మన సేనలను ప్రజోపయోగ కార్యాలకు ఉపయోగించమంటున్నాను. మన సైనికుల సహాయంతో అవసరమైన చోట నదులపై వంతెనలు నిర్మిద్దాం. నదులు లేనిచోట కాలువలు తవ్విద్దాం. బాటల

కిరువైపులా ఫలవృక్షాలు నాటిద్దాం. ధాన్యరాసులు పండించడానికి పొలాలలో కాయకష్టం చేసే రైతులకు మన సైనికులు సాయపడాలి....'' అంటూ రాజు ఇంకా ఏదో చెప్పబోయాడు.

ఇంతలో వీరసింహుడు అడ్డుపడి, ''అద్భుతం మహారాజా, అద్భుతం. ఇక మీదట నా సైనికులకు, పశులకాపరులకు పాలుపితకడం నేర్పమని కట్టడిచేస్తాను; వంట పనిలో ఆడవారికి సాయపడమంటాను,'' అన్నాడు కాస్త కోపంగా.



రాజు చిన్నగా నవ్వాడు. సేనాధిపతి రాజుకన్నా ఒకటి రెండేళ్ళు చిన్నవాడు. అందువల్ల రాజుకు అతడంటే ఎంతో ఆప్యాయత.

''పశులకాపరులకూ, ఆడవారికీ సాయపడడం హీనం కాదు వీరసింహా. ఎదుటివారి ప్రాణాలు తీసి వారి ఆస్తిపాస్తులను అపహరించడంకన్నా ఇది ఎంతో ఉన్నతమైన కృత్యం కాదా! నిదానంగా ఆలోచించు. శాంతి విలువ నీకే అవగతమవుతుంది,'' అన్నాడు రాజు.

అప్పుడు అక్కడికి మంత్రి రావడంతో, సేనాధిపతి ఆ విషయాన్ని అంతటితో వదిలి అక్కడి నుంచి వెళ్ళిపోయాడు. రాజు మంత్రితో వేరొక విషయం గురించి చర్చించసాగాడు.

ఆనాటిరాత్రి సేనాధిపతి వీరసింహుడు దళనాయకులయిన తన అనుచరులు కొందరిని, రహస్యంగా ఒకచోట సమావేశపరచి, ''ఈ రోజు నుంచి, సైనికులయిన మిమ్మల్ని ఖడ్గాలను అవతలపెట్టి, పొలాలలో నాగళ్ళు పట్టమంటున్నాడు మన మహారాజు. ఆడవాళ్ళు వంట చేయడానికి మిమ్మల్ని వంటచెరకు అందించమంటున్నాడు మన మహారాజు!'' అన్నాడు.

దళనాయకులు, అమితాశ్చర్యం చెందారు. కొంతసేపు మౌనం వహించి వీరసింహుడు మళ్ళీ, ''మిత్రులారా, మనం సైనికులుగా శిక్షణ పొందినవాళ్ళం. సాహసం మన ప్రాణం. ఖడ్గ



చాలనం మన ప్రధాన కర్తవ్యం. వీరులమయిన మనం మన కర్తవ్యం మరిచిపోయి మన ఖడ్గాలను తుప్పుపట్టనిస్తామా?'' అని అడిగాడు ఆవేశంగా.

''పట్టనివ్వం!'' అన్నారు వాళ్ళు ముక్తకంఠంతో.

"అరవకండి.గోడలకుచెవులుంటాయి!" అని హెచ్చరించాడు వీరసింహుడు.

వీరసింహుడు ఎంతో జాగ్రత్త తీసుకున్నప్పటికీ, అతడి రహస్యాలోచన వార్త చారుల ద్వారా రాజుకు అందింది. కాని అతడి పథకాల వివరం తెలియలేదు. అయినా, రాజు ఆ విషయాన్ని అంతగా పట్టించుకోలేదు. రాజు స్వతహాగా మంచివాడు కావడంవల్ల, తన బంధువు అంతటి ఘోరకృత్యానికి పాల్పడగలడని ఊహించలేకపోయాడు. పైగా రాజకుమారుడి రెండవ జన్మదినం సమీపిస్తున్నది. రాజూ, మంత్రీ, ఇతర రాజోద్యోగులూ జన్మదినోత్సవ వేడుకల సన్నాహంలో నిమగ్నులై వున్నారు. జన్మదిన వేడుకలను అన్నదానాలతో, నృత్యగానాలతో అతి వైభవంగా జరపడానికి ఏర్పాట్లు జరుగుతున్నవి. తోరణాలు కట్టడానికీ, వేదికలు నిర్మించడానికీ వందలాదిమంది పనివాళ్ళు నియోగించబడ్డారు. బాణాసంచా వేడుకలు జరపడానికి నిపుణులు ఆయత్తమవుతున్నారు. ఈ ఉత్సవం ముగిసిన తరవాత వీరసింహుడితో మాట్లాడుదామనుకుని రాజు, ఆ విషయం గురించి ఉదాసీనం వహించాడు.

యువరాజు జన్మదినంనాడు, వేకువజామునుంచే శాంతిపురంలో మంగళవాయిద్యాలతో వేడుకలు ప్రారంభమయ్యాయి. రాజప్రాసాదం లోపల అందంగా అలంకరించబడిన విశాలమైన మండపంలో రాణి తన బిడ్డను ఒడిలో కూర్చోబెట్టుకుని, ఉన్నతాసనంపై ఆసీనురాలయింది. ఆమె వెనుక చెలికత్తెలు నిలబడ్డారు. వందలాది స్త్రీపురుషులు తండోపతండాలుగా, రాణికీ,



రాకుమారుడికి శుభాకాంక్షలు తెలియ జెప్పడానికి వచ్చారు.

అలా చాలాసేపు కూర్చోవడానికి రాణి గారికి ఇబ్బందిగానే ఉన్నది. అయినా రాజుపట్లా, రాజకుటుంబంపట్లా ప్రజలు చూపుతున్న ప్రేమకూ, భక్తికీ ఆమె ముగ్ధురాలయింది. రాత్రి అయ్యాక, నిద్రిస్తున్న బిడ్డ నెత్తుకుని రాణి శయన మందిరం చేరింది.

జరుగనున్న బాణాసంచా వేడుకలను తిలకించడానికి రాజభవనం ఎదుట వేలాదిమంది జనం గుమిగూడారు. ఒక వైపున నాట్యాలు, జరుగుతున్నవి. మరొక వైపున హాస్యనాటకం చూస్తూ జనం విరగ బడి నవ్వుతున్నారు. అక్కడి వాతావరణం కోలాహలంగా ఉన్నది. సాధారణంగా రాజప్రాసాద ద్వారాలను ఎప్పుడూ భటులు కాపలాకాచేవారు. కాని, ఉత్సవ కారణంగా ఆ రోజు రాకపోకలు సుల భంగా వుంటుందని తలుపులు బార్లా తెరిచి ఉంచారు!

రాణి శయనించబోతున్న సమయంలో, రాజు శయనమందిరంలోకి ప్రవేశించాడు. రాజు ఆగమనానికి రాణి కాస్త ఆశ్చర్యం చెందినా, ఆయన్ను చూసి చిన్నగా నవ్వింది. అంతకుపూర్వం రాజు ఎప్పుడు గాని అలా హఠాత్తుగా ప్రవేశించలేదు.

"మీరు చాలా అలిసిపోయినట్టున్నారు మహారాజా!" అన్నది రాణి.

రాజు ఏమీ మాట్లాడలేదు. చెలికత్తె కేసి చూశాడు. ఆమె అక్కడి నుంచి వెళ్లి పోయింది.

"ఏమయింది మహారాజా?" అన్నది రాణి ఎంతో ఉత్కంఠతో.

రాజు మౌనంగా తలుపులు మూసి, గడియవేసి, నుదుటికి పట్టిన చెమట బిందువులను తుడుచుకుంటూ, "దేవీ, ఏం జరిగిందో వివరంగా చెప్పడానికి ఇది సమయం కాదు. మన ప్రాణాలకు ఆపద వచ్చింది. నువ్వు వెంటనే రహస్య మార్గం కుండా తప్పించుకుపోవాలి!" అన్నాడు.



''ఏమిటీ ? రహస్యమార్గంకుండానా?'' అన్నది రాణి అమితాశ్చర్యంతో.

''అవును!'' అన్నాడు రాజుగంభీరంగా.

రాణికి పిడుగుపడ్డట్టయింది. శయన మందిరం నుంచి, అరణ్యమధ్యానికి ఒక రహస్య సొరంగమార్గం ఉన్నది. ఆ రహస్యమార్గం గురించి రాజుకు ఆయన తండ్రీ, తండ్రికి ఆయన తండ్రీ చెప్పారు. రాజు శాంతిదేవుడు ఒకసారి రాణికి ఆ మార్గం చూపించాడు కూడా. ఇరువురూ కలిసి ఒకనాడు ఆ మార్గంగుండా కొంత దూరం వెళ్ళి తిరిగి వచ్చారు. సరదాకు వెళ్ళి రావడమే తప్ప ఆ మార్గంగుండా ప్రాణరక్షణకు తప్పించుకుని పారి పోవలసిన దుస్థితి ఏర్పడుతుందని రాజ దంపతులు కలలో కూడా అనుకోలేదు.

''నేను ఒంటరిగానే వెళ్ళిపోవాలా ?'' అన్నది రాణి భయం భయంగా.

''ఒంటరిగా కాదు; మన బిడ్డతోపాటు తప్పించుకోవాలి !'' అన్నాడు రాజు.

''మిమ్మల్ని ఇక్కడ వదిలి నేనొక్క తెనే ఎలా వెళ్ళను ?'' అన్నది రాణి.

''దేవీ, మన బిడ్డకోసం నువ్వు ఈ త్యాగం చెయ్యకతప్పదు. శత్రువుల గురి నామీదే ఉన్నప్పటికీ, మన ముగ్గుర్నీ హతమార్చాలని పథకం వేశారు. నేనూ మీతో కలిసి తప్పించుకున్నట్టయితే, ఎలా గయినా మనల్ని పట్టుకోవడానికి వాళ్ళు ప్రయత్నిస్తారు. కాని, నేను ఇక్కడే వుండి పోరాడినట్టయితే, తాత్కాలికంగా నైనా, వాళ్ళు నిన్నూ, బిడ్డనూ మరిచి పోవచ్చు.'' అని వివరించాడు రాజు.

ఆ తరవాత ఆయన, వీరసింహుడు తన అనుచరులతో కలిసి రాజ్యసింహాస నాన్ని కబళించడానికి పన్నిన కుట్ర గురించీ, వేడుకల కోలాహలంలో రాజ కుటుంబాన్ని సర్వనాశనం చేయడానికి వేసిన పథకం గురించీ రాణికి క్లుప్తంగా చెప్పాడు.

ఇప్పుడు రాజప్రాసాద ద్వారాలన్నీ వీరసింహుడి అధీనంలో ఉన్నట్టు రాజుకు

చారుల ద్వారా తెలిసింది. మరొక అర గంటలో ప్రజలు కనీవినీ ఎరుగని బాణా సంచా వేడుకలు జరుగనున్నవి. బ్రహ్మాండమైన భవనం వంటి బాణాసంచా ఆకాశం లోకి ఎగిసి భయంకర శబ్దంతో పేలుతుంది. ప్రజలందరూ ఆ వేడుకలలో లీనమై ఉన్నప్పుడు, వీరసింహుడూ అతని అనుచరులూ రాజప్రాసాదంలో జొరబడి, రాజ కుటుంబాన్ని సర్వనాశనం చేసేస్తారు!



"మీ అంగరక్షకులు ఏమయ్యారు?" అని అడిగింది రాణి కన్నీళ్ళతో.

"వేడుకలు చూడమని వాళ్ళందరినీ నేనే పంపాను. ఇప్పుడు నేను రాజ ప్రాసాదం నుంచి బయట అడుగుమోప లేను. వీరసింహుడి భటులు ద్వారాలను కాపలా కాస్తున్నారు. వాళ్ళకంటబడకుండా వెళ్ళడం అసాధ్యం. మనమిప్పుడు ఇలా బందీలుగా వున్న విషయం బయట ఏ ఒక్కరికీ తెలియదు!" అన్నాడు రాజు విషాదంగా నవ్వుతూ.

"ఇప్పుడు మీరేం చేయాలనుకున్నారు?" అన్నది రాణి.

"వాళ్ళ నుంచి తప్పించుకోవడానికి ప్రయత్నిస్తాను. సాధ్యం కానప్పుడు, ఎదిరించి పోరాడతాను. నువ్వు నేను చెప్పిన ప్రకారం చేశావంటే మనకు విజయం సగం సమకూరినట్టే!" అన్నాడు రాజు.

"నన్నేంచేయమనిఆజ్ఞ," అన్నది రాణి, దిగులుగా.

"దేవీ, కాలయాపన చేయకుండా ఇక్కడి నుంచి పారిపో. నువ్వూ, బిడ్డా క్షేమంగా వుంటే అదే నాకు ఒక విధమైన విజయం. నిజం చెప్పాలంటే శత్రువుల దాడిని ఎదుర్కొని బయటపడగలననే నమ్మకం నాకు లేదు. ఇక వాదవివాదాలు వద్దు," అన్నాడు రాజు గద్గద స్వరంతో.

"మిమ్మల్ని మృత్యువుకు అప్పగించి, నేనుమాత్రం తప్పించుకుని పారిపోలేను," అని విలపించింది రాణి.

రాజు ఆ మాటలేవీ వినిపించుకోలేదు. ఆయన రహస్యమార్గాన్ని తెరవడంలో

లీనమయ్యాడు. ఎవరూ అనుమానించ డానికి వీలుకాకుండా, శయనమందిరం ద్వారం దగ్గరే రహస్య మార్గద్వారం కూడా ఉన్నది!

రహస్యమార్గద్వారం తెరుచుకున్నది. రాజు చీకటిగా వున్న మార్గంలోకి తొంగి చూస్తూ, రాణితో, "ఒక చేతిలో బిడ్డనూ, మరొక చేత్తో కాగడానూ పట్టుకుని ఈ మార్గంలో ప్రవేశించు. సొరంగమార్గంలో ప్రతి ఐదువందల గజాలకూ ఒక మణి చొప్పున పన్నెండు మణులు పొదిగివున్న సంగతి నీకు తెలుసు. చీకట్లో అవి మెరుస్తూ వుంటాయి. కాగడా వెలుతురు పడినప్పుడు అవి మరింత ప్రకాశిస్తాయి. చిట్టచివరి మణిని చేరాక దానిని రెండు మూడుసార్లు కదిలించావంటే అవతలి ద్వారం తెరుచుకుంటుంది!" అన్నాడు.

రాజమందిరం వెలుపల వినిపిస్తూన్న నవ్వులూ, మాటలూ ఆగిపోయాయి.

"వీరసింహుడు వస్తున్నట్టున్నది దేవీ, వెళ్ళిరా. ఈ జన్మలో కాకపోతే వచ్చే జన్మలోనైనా తప్పక కలుసుకుందాం," అంటూ రాజు, నిద్రపోతూన్న బిడ్డను రాణి చేతుల్లో పెట్టాడు. ఆ తరవాత కాగడాను అందించి, ఆమె సొరంగ మార్గంలో దిగడానికి సాయపడ్డాడు.

కన్నీళ్ళతో తనకేసి దీనంగా చూస్తూన్న రాణితో, "నిన్నీవిధంగా పంపడానికి నాకు బాధగానే ఉన్నది. అయినా మన బిడ్డ కోసం ఈ పని చేయక తప్పడం లేదు, దేవీ," అన్నాడు రాజు.

కొంతసేపటికి రాణిని చీకటి ఆవరించు కున్నది.

రహస్యమార్గం తలుపులు మూసిన మరుక్షణమే, వెలుపలినుంచి దిక్కులు పిక్కటిల్లే బ్రహ్మాండమైన శబ్దం వినిపించింది. బాణాసంచా వేడుకలు జరుగు తున్నవి.

తలుపులను ఎవరో దబదబా బాదడం వినిపించింది. రాజు వెంటనే కత్తిదూసి, "ఎవరక్కడ?" అన్నాడు గంభీర స్వరంతో. —(ఇంకావుంది)






# గానపిశాచి

పట్టువదలని విక్రమార్కుడు చెట్టు వద్దకు తిరిగి వెళ్ళి, చెట్టుపై నుంచి శవాన్ని దించి భుజాన వేసుకుని, ఎప్పటిలాగే మౌనంగా శ్మశానం కేసి నడవసాగాడు. అప్పుడు శవంలోని బేతాళుడు, "రాజా, తన బలం ఏపాటిదో గుర్తింపులేక, తలకు మించిన బరువు ఎత్తుకునేవాడు భంగపడి, పరుల అవహేళనకు పాత్రుడవుతాడు. నువ్వు తలపెట్టిన కార్యం నీ శక్తిసామర్థ్యాలకు, మించినదవునో కాదో, నాకు తెలియదు. తనకు తృప్తి కలిగేవరకూ, తాను వున్న ఇంటినుంచి కదలనని పంతగించిన పిశాచం ఒకటి, మధ్యలోనే విసిగి ఇల్లొదిలి పారిపోయింది. నీకు శ్రమ తెలియకుండా వుండేందుకు, ఆ పిశాచి కథ చెబుతాను, విను," అంటూ ఇలా చెప్పసాగాడు:

ఒకానొకప్పుడు హరపుర గ్రామంలో, హరిశర్మ అనే గొప్ప గాయకుడుండేవాడు.

## బేతాళ కథలు



ఆయనకు రామశర్మ, కృష్ణశర్మ, దేవశర్మ, విష్ణుశర్మ అని నలుగురు కొడుకులు. తన కొడుకులు కూడా సంగీతంలో తనంతటి వాళ్ళు కావాలని ఆయన అభిలాష.

కొంతకాలం కొడుకులకు సంగీతం నేర్పిన తర్వాత, హరిశర్మ వాళ్ళతో ''నాకు వయసు మీరుతున్నది. మీలో ఒక్కరిని మాత్రమే, నా అంతటి వాణ్ణి చేయగలను. అందుకు తగినవాడెవ్వడో నిర్ణయించగలిగినది, హరిపురంలోని శివశర్మ ఒక్కడే. మీరాయననుకలుసుకుని మెప్పించి రండి,'' అన్నాడు.

నలుగురన్నదమ్ములూ సరేనని, హరీపురంలోని శివశర్మ ఇంటికి వెళ్ళారు. ఆయన వాళ్ళు చెప్పింది పూర్తిగా విని, ''మీరు తగు సమయంలోనే వచ్చారు. ఈ ఊరి పొలిమేరలో నాకొక ఇల్లుంది. ఒక గానపిశాచి దాన్నావహించుకుని వున్నది. అది రోజూ రాత్రి, ఆ ఇంట్లో గానకచేరీ చేస్తూంటుంది. అది అద్భుతంగా పాడినప్పటికీ, పిశాచి కావడం వల్ల రాత్రిళ్ళెవ్వరూ, ఆ ఇంటి ఛాయలకు కూడా వెళ్ళడం లేదు. గానపిశాచి కారణంగా నిక్షేపంలాంటి ఇంటిని పాడుపెట్టవలసివచ్చింది. ఈ విషయంలో నేను, మీ సాయం కోరుతున్నాను,'' అన్నాడు సంతోషంగా.

''పిశాచి విషయంలో మీకు సాయపడడానికి, మేమేం భూతవైద్యులంకామే!'' అన్నాడు రామశర్మ.

''ఆ పిశాచి చాలా శక్తివంతమైనది. భూతవైద్యులు కూడా దాన్నేమీ చేయలేకపోయారు. ఆ పిశాచిని గానకోవిదులు తప్ప వేరెవ్వరూ లొంగదీయలేరని తెలిసిపోయింది. సంగీత విద్వాంసులంటే, ఆ పిశాచికెంతో గౌరవం,'' అని చెప్పాడు శివశర్మ.

నలుగురన్నదమ్ముల్లోనూ రామశర్మ ధైర్యవంతుడు. అతడు ముందుగా, గానపిశాచి వున్న ఇంటికి వెళ్ళేందుకు సిద్ధపడ్డాడు. శివశర్మ అతణ్ణి మెచ్చుకుని,

రాత్రికాగానే పిశాచి వున్న ఇంటికి దారి చూపించాడు.

రామశర్మ ఇంట్లో అడుగుపెట్టేసరికి, పిశాచి ఏదో శాస్త్రీయరాగాన్ని అద్భుతంగా ఆలాపిస్తున్నది. రామశర్మ చప్పట్లుకొట్టి, "నువ్వు చాలా బాగా పాడుతున్నావు. ఇది సామాన్యులకు సాధ్యపడే రాగంకాదు," అన్నాడు.

పిశాచి పాట ఆపి, "అయ్యా, నా రాగాలాపనలోని గొప్పతనం, నీకెలా తెలిసింది? నువ్వుసంగీతవిద్వాంసుడివా?" అని అడిగింది.

"అవును, నీ గురించి విని, నిన్ను చూడాలని ఇక్కడికి వచ్చాను," అన్నాడు రామశర్మ చిన్నగా నవ్వుతూ.

"చాలా సంతోషం. మీకు బాగా నచ్చిన రాగమొకటి, నాకు వినిపిస్తే యింకా సంతోషిస్తాను," అన్నది పిశాచి, ఎంతో ఆనందంగా.

రామశర్మ వెంటనే ఒకరాగం ఆలాపించాడు. పిశాచి అతడి ప్రతిభను మెచ్చుకుని, "అయ్యా, చెప్పకుండానే, మీ మనసులోని కోర్కెను తెలుసుకున్నాను. అయితే నా గానానికి ప్రతిఫలంతోపాటు తృప్తికూడా కలిగేదాకా, నేనీ ఇల్లు వదలలేను. కాబట్టి మీ గానానికి నేనిచ్చే ప్రతిఫలం తీసుకుని యిక్కడినుంచి వెళ్ళి



పొండి," అంటూ విలువైన వజ్రాన్నతడికి కానుకగా యిచ్చింది.

తన సంగీత విద్యకు, మానవాతీత శక్తినుంచి కానుక లభించినందుకు సంతోషించి, రామశర్మ, శివశర్మకు జరిగింది చెప్పాడు.

శివశర్మ నిట్టూర్చి, "నీ గానంవల్ల నువ్వు ప్రయోజనం పొందావు. నాకే ప్రయోజనమూ కలగలేదు," అన్నాడు.

అప్పుడు రెండోవాడు కృష్ణశర్మ, "గాన పిశాచి తన గానానికి ప్రతిఫలం కోరుతున్నది. దానికి నేను చక్కటి ప్రతిఫలం యిస్తాను," అని ఆ రాత్రి పిశాచి వుండే యింటికి వెళ్ళి, అది పాడుతుండగా



విని, "మీ గానానికి ప్రతిఫలంగా, యీ వజ్రం తీసుకోండి. ఎందుకో మీ పాట విన్నాక, నాకు లభించిన ప్రతిఫలం తృప్తి కలిగించడంలేదు. నాకు తృప్తి కలిగే వరకూ, నేనిక్కణ్ణించి వెళ్ళలేను," అన్నది.

కృష్ణశర్మ జరిగింది శివశర్మకు చెప్పి, "నేను బాగా పాడడంవల్ల పిశాచికి అసంతృప్తి కలిగివుంటుంది. తన పాట అంత గొప్పగా లేదనితోచి, పిశాచికి బిరుదువల్ల కలిగిన ఆనందం తగ్గివుండాలి," అన్నాడు.

"ఈ తప్పును నేను దిద్దుకుంటాను," అని దేవశర్మ మర్నాడు రాత్రి, పిశాచి వున్న ఇంటికి వెళ్ళాడు. అప్పుడే పిశాచి ఒక పాట ప్రారంభించింది. దేవశర్మ వెంటనే, "నీ పాట వినగానే, నీతో పోటీపడి నిన్నోడించాలనిపిస్తోంది," అంటూ తనొక పాట అందుకున్నాడు.

అతడి పాట పూర్తికాగానే, పిశాచి మెచ్చుకుని, అతడికొక వజ్రాన్నిచ్చింది.

దేవశర్మ వజ్రం తీసుకుని, "ఈ వజ్రాన్నమ్మగా వచ్చిన డబ్బే, యిక నా జీవనాధారం. సంగీత విద్యలో తనకుతానే సాటి అనిపించుకున్న హరిశర్మ పుత్రుడనైవుండీ, పాటలో నీతో పోటీపడలేకపోయాను. ఇక నేను సంగీతాన్నెవరికీ వినిపించను!" అన్నాడు.

గట్టిగా చప్పట్లుకొట్టి మెచ్చుకుని, "మహా విద్వాంసుడైన హరిశర్మ పుత్రుణ్ణి నేను. పేరు కృష్ణశర్మ. అద్భుతమైన నీ పాండిత్యానికి మెచ్చి, 'మానవాతీతగాన సుందరి' అన్న బిరుదును, నీకిస్తున్నాను," అన్నాడు.

పిశాచి అతడికి భక్తి పూర్వకంగా నమస్కరించి, "ఇంతకాలానికి, నా గానానికి ప్రతిఫలం లభించింది. ఎంతో సంతోషం. మీ పాట వినిపించి నన్నింకా సంతోషపెట్టవలసిందిగా కోరుతున్నాను," అన్నది.

కృష్ణశర్మ అప్పుడు, తనకు బాగా వచ్చిన రాగాలాపన చేశాడు. పిశాచి అది

పిశాచి వెంటనే, "పండితోత్తమా! నీ మాటలు నాకు సంతోషాన్ని కలిగించాయి. కానీ మనసుకు తృప్తిగాలేదు. నా పాట విన్న కారణంగా, నువ్వు సంగీతానికి స్వస్తిపలికితే, నాకెంతో బాధగావుంటుంది. ఆ పని మాత్రం చెయ్యకు," అని అతణ్ణి పంపేసింది.

దేవశర్మ చెప్పింది విని, శివశర్మ, "ఆ పిశాచిని నా ఇంట్లోంచి తరిమేయడం, మీ అన్నదమ్ములకు సాధ్యమయ్యేలా తోచడంలేదు. ఎలాగూ అందరూ ఇంత దూరం వచ్చారు కాబట్టి, అందరూ ఒక సారి ప్రయత్నించడం మంచిది," అని మర్నాటి రాత్రికి విష్ణుశర్మను, పిశాచి దగ్గిరకు పంపించాడు.

విష్ణుశర్మ వెళ్ళేసరికి పిశాచి గానం చేస్తున్నది. అతడు మాట్లాడకుండా, పిశాచి ఎదురుగా కూర్చుని పాట వినసాగాడు. పిశాచి అలా చాలాసేపు పాట పాడింది. విష్ణుశర్మ పరమానందంగా విన్నాడు.

పాట పూర్తయ్యాక పిశాచి, విష్ణుశర్మను "అయ్యా, తమరెవరు?" అని అడిగింది.

"విద్వాంసుల పరిచయం విద్యతోనే గదా!" అంటూ విష్ణుశర్మ వెంటనే రాగాలాపన చేశాడు.

అతడి గానం పూర్తయ్యాక పిశాచి, అతడితో, "మహానుభావా, ఇన్నాళ్ళకు నా గానానికి తృప్తికరమైన ప్రతిఫలం దొరికింది. ఇక నేనీ ఇల్లు వదిలి వెళ్ళిపోతున్నాను," అని మాయమైంది.



బేతాళుడు ఈ కథ చెప్పి, ''రాజా, ఉన్నట్టుండి పిశాచి తృప్తిపడ్డానంటూ ఇల్లొదిలిపోవడం ఆశ్చర్యంగాలేదా? తాము సంగీత విద్వాంసులమంటూ, రోజూ రాత్రి వేళ ఎవరో ఒకరు వచ్చి, తన గానానికి ఆటంకం కలిగిస్తూండడం, పిశాచానికి విసుగనిపించి వుంటుంది! అందువల్ల, ఇల్లొదలనన్న దాని పట్టుదల క్రమంగా సన్నగిల్లి, ఆ ఇంటినుంచి పారిపోయి వుండాలి. సంగీత విద్యలో సరిసమానులైన అన్నదమ్ముల్లో ముగ్గురు, తమ సంగీతం ద్వారా పిశాచానికి కలిగించలేని తృప్తిని, నాలుగోవాడైన విష్ణుశర్మ కలిగించాడనుకోవడం హేతుబద్ధం కాదు గదా? ఈ సందేహానికి సమాధానం తెలిసి కూడా చెప్పలేకపోయావో, నీ తల పగిలి పోతుంది,'' అన్నాడు.

దానికి విక్రమార్కుడు, ''పిశాచి ప్రవర్తన గురించి ఆశ్చర్యపడవలసిందేమీ లేదు. సంగీత విద్వాంసుడికి తృప్తినిచ్చేది అర్హతగల శ్రోత మాత్రమే! అన్నదమ్ముల్లో మొదటి ముగ్గురూ పిశాచి పాటను పొగిడారు తప్ప, దాని పాటను పూర్తిగా వినాలనుకోలేదు. మంచి పాటను సగంలో ఎవరూ ఆపలేరుగదా! అందువల్ల పిశాచికి తన పాటపట్ల అసంతృప్తి కలిగింది. విష్ణుశర్మ ఒక్కడే పిశాచి పాటను మధ్యలో ఆపకుండా పూర్తిగా విన్నాడు. విష్ణుశర్మ పాట పాడాక, అతడు కూడా ఎంతటి గొప్ప సంగీత విద్వాంసుడో పిశాచికి తెలిసింది. అంతటి మహా విద్వాంసుడు తన పాటను పూర్తిగా విన్నాడన్న తృప్తితో, అది అతడి మనసులోని కోర్కెను తీర్చి వెళ్ళిపోయింది. పిశాచాన్ని ఇంటినుంచి బయటకు పంపాలన్న కోర్కెను మించి, పిశాచి పాటను విని ఆనందించాలనుకున్న సంగీత జిజ్ఞాసువు విష్ణుశర్మ! కనుక, హరిశర్మ, తన నాలుగో కొడుకయిన విష్ణుశర్మను తనంతటి వాణ్ణి చేయడం ధర్మం.'' అన్నాడు.

రాజుకు ఈ విధంగా మౌనభంగం కలగగానే, బేతాళుడు శవంతో సహా మాయమై, తిరిగి చెట్టెక్కాడు. —(కల్పితం)





# కార్యసాధకుడు

సౌవీర, మత్స్య దేశాలు ఇరుగుపొరుగు రాజ్యాలు. తరాలుగా వాటిమధ్య స్నేహ సంబంధాలుండేవి. కాని, ఉన్నట్లుండి మత్స్యరాజు, సౌవీరదేశంపై యుద్ధాన్ని ప్రకటించాడు. కారణం తెలియక సౌవీర రాజు తల్లడిల్లాడు. ఎందుకంటే, ఏరకంగా చూసినా, మత్స్యదేశంతో పోలిస్తే సౌవీర రాజ్యం చిన్నది. యుద్ధం అంటూ జరిగితే, ఓడిపోవడం ఖాయమని సౌవీరరాజుకు తెలుసు.

ఈ స్థితిలో మత్స్యరాజు పంపిన రాయబారి, సౌవీరరాజును కలుసుకుని, ''మహారాజా, యుద్ధమంటే జననష్టం, ధననష్టం అని, మా మహారాజుకు తెలియందికాదు. అందువల్ల వారి మాటగా చెప్పమన్నారు. మీరు గనక మా మహారాజుకు సామంతులుగా వుండేందుకు అంగీకరిస్తే, యుద్ధ ప్రసక్తే వుండదు,'' అని చెప్పాడు.

సౌవీరరాజు కొంచెంసేపు ఆలోచించి, ''మేము రెండువారాల గడువు కోరుతున్నామని, మీ మహారాజుకు చెప్పండి. మా రాయబారి ఆయనను దర్శించి, మా అభిప్రాయం ఏమిటో తెలియపరచగలడు,'' అన్నాడు.

మత్స్యదేశపు రాయబారి, సరేనని వెళ్ళిపోయాడు. సౌవీరరాజు ఏంచేయాలో పాలుపోక, తన మంత్రి సలహా అడిగాడు.

''మహారాజా, దీన్ని గురించి మనం భయాందోళనలు చెందనవసరంలేదు. మన ఆస్థానకవి సృజనశర్మగారిని రాయబారిగా పంపండి. ఆయన మంచి చెడ్డలు ఎదుటివారికి అర్థమయ్యేలా చెప్పగల అనుభవజ్ఞుడు. ముఖ్యంగా మంచి కార్యసాధకుడు. ఒకవేళ ఆయన రాయబారం విఫలమయితే, అప్పుడు ఏం చేయాలో ఆలోచిద్దాం,'' అన్నాడు మంత్రి.

డా॥ తాటిచెర్ల గురురామప్రసాద్

రాజుకు యీ సలహా నచ్చింది. ఆయన సృజనశర్మకు సంగతి సందర్భాలు చెప్పి, మత్స్యదేశానికి రాయబారిగా వెళ్ళి రమ్మన్నాడు. సృజనశర్మ వేగులను ముందుగా పంపి, మత్స్యరాజు గురించి ఆరా తీశాడు.

మత్స్యరాజు స్వతహాగా మంచివాడు, పండితుడు. ఆయనకు సౌవీరరాజ్యాన్ని కబళించాలనే దురుద్దేశంలేదు. పచ్చగా కళకళలాడుతున్న సౌవీర అభివృద్ధికి ఈర్ష్యపడినది, మత్స్యరాజుకు సలహాలిచ్చే అంతరంగికమండలి లోనివాళ్ళు.

మత్స్యరాజు అంతరంగికమండలిలోని ముఖ్య సభ్యులు ముగ్గురు. ఒకడు ధనగుప్తుడు; పెద్ద వ్యాపారి. రెండోవాడు మాధవవర్మ; సేనాపతి. మూడోవాడు మంత్రి సోమశేఖరుడు.

సృజనశర్మ గూఢచారులద్వారా, వాళ్ళ స్వభావాల గురించి తెలుసుకున్నాడు. ధనగుప్తుడు లోభి. మాధవవర్మ కఠినుడు. సోమశేఖరుడు మూర్ఖుడు.

సృజనశర్మమత్స్యదేశంచేరి, ముందుగా ధనగుప్తుణ్ణి, రాత్రివేళ ఆయన రహస్య మందిరంలో కలిశాడు. అతడికి తాను తెచ్చిన విలువైన వజ్రాన్ని కానుకగా యిచ్చి, ''మీబోటి వర్తక శ్రేష్ఠులు పూనుకుంటే, ఎలాటి రాజైనా మాట వినక తప్పుతుందా? రాజుగారికి మీ మాట చెప్పి, మా సౌవీర మీద దాడిని విరమింపజేసేలా చూడండి. మీ ఋణం వుంచుకోం.



మళ్ళీ మా శక్తికొద్దీ బహుమానాలు యిచ్చుకుంటాం,'' అన్నాడు.

రాబోయే బహుమానాలమీది ఆశతో, ధనగుప్తుడు సరేనన్నాడు.

తర్వాత సృజనశర్మ, సేనాపతి మాధవ వర్మను, నగర పొలిమేరల్లోని సైనిక శిబిరాలవద్దఏకాంతంలో కలుసుకున్నాడు. ఈ సేనాపతి, ధనగుప్తుడిలా లోభికాడు. ప్రలోభాలకు లొంగడని శర్మకు తెలుసు.

ఆ కారణంగా సృజనశర్మ, మాధవ వర్మను చూస్తూనే, ''మహావీరుడికి అభివాదం! పిచ్చుకమీద బ్రహ్మాస్త్రం వేయడం భావ్యమా?'' అని అడిగాడు.

"మీరనేదేమిటి? అర్థమయ్యేలా సూటిగా చెప్పండి,'' అన్నాడు వర్మ కఠినంగా.

మనసు నొచ్చుకున్నా, శర్మ ఎంతో వినయంగా, ''మీలాంటి పరాక్రమ వంతులు తలిస్తే, మా సౌవీరను గెలవడం ఎంతపని? కాని దీనివల్ల మీకు కీర్తిరాదు; అపకీర్తి వస్తుంది. అదే చేదిరాజు విర్ర వీగుతున్నాడు. అలాంటి వాడిని జయిస్తే మీకు కీర్తితోపాటు అపారమైన ధన రాసులు కూడా లభ్యం కాగలవు.'' అన్నాడు.

ఈ విధంగా మాధవవర్మను మంచి మాటలతో ఒప్పించి, సృజనశర్మ, అక్కడి నుంచి మంత్రిని చూడడానికి బయలుదేరాడు.

మంత్రి సోమశేఖరుడు ఒట్టి మూర్ఖుడు. పొగడ్తలకు ఉబ్బిపోయే తత్వంకలవాడు.



అతడు సాయంకాలంవేళ భవనం ముందున్న పూలతోటలో, భార్యాబిడ్డలతో తిరుగుతూండగా, సృజనశర్మ వెళ్ళి నమస్కరించి, "మంత్రివర్యా! ఈ రాజ్యంలో మీకు సాటిగా ఎవరు నిలబడ గలరు? మీ అఖండమైన తెలివితేటలు, మరేరాజ్యపు మంత్రికీ లేవని అందరూ ఎరిగినదే కదా! పేరుకు రాజు కాదు గాని, నిజానికి మత్స్యరాజ్యాన్ని ఏలు తున్నది తమరేకదా! మీ మాట కాదనే ధైర్యం రాజుగారికి లేదని చాలామందికి తెలుసు," అన్నాడు.

ఈ పొగడ్తకు ఉబ్బితబ్బిబ్బయిన మంత్రి, "ఇంతకూ తమరొచ్చిన పనేమిటి?" అని అడిగాడు.

"మీరు రాజుగారికి నచ్చజెప్పి, సౌవీర మీద యుద్ధానికి రాకుండా చేయాలి," అని శర్మ కోరాడు.

అలా చేయడం సాధ్యపడదంటే, భార్యా బిడ్డల మధ్య తలవొంపులు కాబట్టి, సోమ శేఖరుడు సరేనన్నాడు.

మర్నాడు సృజనశర్మ, మత్స్యరాజును నిండు సభలో కలిశాడు. తానెవరైనదీ ముందుగా చెప్పకుండా, తన కవితా పాటవంతో ఆయనను మెప్పించాడు.

"నీకేమి కావాలో కోరుకో," అన్నాడు రాజు, శర్మ పాండిత్యానికి ముగ్ధుడైపోయి.

"మన్నించండి, ప్రభూ! నేను సౌవీర దేశపు రాయబారిని," అని సృజనశర్మ చెప్పి, యుద్ధంవల్ల కలిగే దుష్ఫలితాలను వివరించి శాంతిభిక్ష పెట్టమని అర్థించాడు.

మత్స్యరాజు అందుకు అంగీకరించి, సృజనశర్మను గౌరవపూర్వకంగా సౌవీరకు పంపే ఏర్పాట్లు చేశాడు.

శర్మ నగరం చేరగానే, సౌవీరరాజు ఆనందంతో అతణ్ణి కౌగలించుకుని ఘనంగా సన్మానించాడు.

తర్వాత జరిగినదంతా విన్న సౌవీర రాజుకు—లోభిని ధనంతో, కఠినుణ్ణి వినయంతో, మూర్ఖుణ్ణి పొగడ్తలతో, పండితుణ్ణి సత్యవచనాలతో వశపరుచుకో వచ్చని తెలిసింది.



# చందమామ అనుబంధం—11

# మన విజ్ఞాన సంపద

## మహనీయులు:



### ఈశ్వరచంద్ర విద్యాసాగర్

ఒక పండితుడు రైల్వేస్టేషన్లో దిగాడు. ఆయన వద్ద చిన్న సంచీ మాత్రమే ఉన్నది. అయినా, దానిని మోయడానికి ఇష్టంలేక చుట్టుపక్కల జూసి, మామూలుగా కనిపిస్తున్న ఒక మనిషితో, "నువ్వు కూలీవా? ఈ సంచీ పట్టుకురా," అని చెప్పి సంచీ అందించాడు. నిరాడంబరంగా కనిపిస్తున్న ఆ వ్యక్తి, సంచీ పట్టుకుని పండితుడి వెంట నడిచాడు. తీరా పండితుడు గమ్యస్థానం చేరాక, తాను కలుసుకోవడానికి వచ్చిన ఈశ్వర చంద్ర విద్యాసాగరే తన సంచీని మోసుకువచ్చాడని తెలిసి అవాక్కయిపోయాడు. గొప్ప సంస్కర్త అయిన ఈశ్వరచంద్ర విద్యాసాగర్, 1820 వ సం॥ సెప్టెంబర్ 26 వ తేదీన బెంగాల్‌లోని మిడ్నపూర్ జిల్లాలో జన్మించాడు. ఆయన కలకత్తా ప్రభుత్వ సంస్కృత కళాశాల ప్రిన్సిపాల్ పదవినలంకరించాడు. ఆ రోజులలో బాల్య వివాహాలు విపరీతంగా జరిగేవి. తమకు పెళ్ళయిందని తెలుసుకునేలోగానే చాలామంది స్త్రీలు వితంతువులయ్యేవారు. వితంతూ పునర్వివాహం చట్టబద్ధం చేయడానికి విద్యాసాగర్ కృషిచేశాడు. ఆయన ఎన్నో పాఠశాలలు, కళాశాలలు స్థాపించి పాశ్చాత్య శాస్త్రీయ విజ్ఞానాన్నీ, తాత్వికచింతనా ధోరణులనూ ప్రవేశపెట్టాడు. 1891 వ సం॥ పరమపదించాడు।

## ఎవరాయన?

గాఢాంధకారం అలముకుని ఉన్న ఒకనాటి చీకటి రాత్రి, దొంగ ఒక ఇంట్లో జొరబడ్డాడు. ఇల్లు చాలా విశాలంగానే ఉన్నది. కాని అందులో ఒక సాధువు మాత్రమే ఉంటున్నాడు. విచిత్రమేమిటంటే ఆయన ఇంటి తలుపులు ఎన్నడూ మూసేవాడు కాదు. దొంగకు ఈ విషయం తెలుసు.

సాధువు గాఢనిద్రలో వున్నాడు. ఆయన సమీపంలో దీపం వెలుగుతున్నది. పక్కనే కొన్ని తాళపత్రాలు మాత్రం కనిపించాయి.

వంటగదిలో కొన్ని పాత్రలు తప్ప, దొంగకు ఇంట్లో విలువైనవేవీ కనిపించలేదు. వాటినయినా వదిలిపెట్టడానికి ఇష్టం లేక, ఈ రాత్రికి ఇది చాలులే అనుకుని, దొంగ, వాటినన్నిటినీ మూటకట్టుకుని వీధి తలుపు దగ్గరికి వచ్చాడు. వాకిట్లో ఆజానుబాహువు ఒకడు చేత బాణంతో ఇంటిని కాపలా కాస్తున్నాడు. దొంగ పెరటిదారికుండా పారిపోవడానికి ప్రయత్నించాడు కాని, అక్కడ కూడా అలాంటి వ్యక్తే ఎదురయ్యాడు. దొంగ భయంతో వణికిపోయాడు. సాధువు నిద్రలేచాక ఆయన పాదాలపైబడి క్షమాపణలు చెప్పుకున్నాడు. అప్పుడు సాధువు దొంగతో, "నువ్వెంతో పుణ్యపురుషుడివి. కాపలా కాస్తున్న రామలక్ష్మణులను కళ్ళారా చూడగలిగావు!" అన్నాడు.

ఈ కథలోని సాధువు ఎవరో మీకు తెలుసా?

(36 వ పేజీ చూడండి)


The Parliament House

DELHI


Prithviraj Chauhan


Mohammad Ghori


Shah Jahan


Qutub Minar


The Red Fort

భారతదేశం : నాడు - నేడు

# ఢిల్లీ మహానగరం

మహాభారతంలో పాండవులు పరిపాలించిన ఇంద్రప్రస్థపురంగా వర్ణించబడిన స్థలానికి కాస్త అటూ ఇటూగా, ఈనాటి భారతరాజధానీనగరం ఢిల్లీ ఉన్నది. ఇవాళ కూడా ఢిల్లీనగరంలో ఒక ప్రాంతం ఇంద్రపట్‌గా పిలువబడుతున్నది!

భారతకాలం నుంచి, ఈనాటి వరకు ఢిల్లీ ఏడుసార్లు నిర్మించబడినట్టు చెబుతారు. ఏడవసారిగా దీనిని షాజహాన్ చక్రవర్తి పునర్నిర్మించాడు. దేశ స్వాతంత్ర్యానంతరం కొత్త ఢిల్లీ మరింత వేగంగా అభివృద్ధి చెందుతున్నది. అందువల్ల, ఈనాటి ఢిల్లీనగరాన్ని ఎనిమిదవ ఢిల్లీ అని చెప్పినా తప్పుకాదు. అయినప్పటికీ, ప్రస్తుత ఢిల్లీనగరంలో, వెనుకటి ఏడు నగరాలశోభ అక్కడక్కడ సాక్షాత్కరిస్తూనే ఉన్నది.

పదకొండవ శతాబ్దంలో అనంగపాలుడనే రాజు ఈ నగరాన్ని అందాల నగరంగా తీర్చిదిద్దాడు. ఆయన నివసించిన లాల్‌కోట శిథిలాలు, కుతుబ్‌మీనార్ సమీపంలో ఉన్నవి. ఢిల్లీనిపరిపాలించిన కట్టకడపటి హైందవరాజు పృథ్వీరాజ్ చౌహాన్. కన్నతండ్రి జయచంద్రుడి అభీష్టానికి విరుద్ధంగా, కనూజ్ యువరాణి సంయుక్త, పృథ్వీరాజును వివాహమాడింది. ఆగ్రహం చెందిన జయచంద్రుడు, మహమ్మదుఘోరీతో చేతులు కలిపి, ఢిల్లీనగరాన్ని ముట్టడించాడు. పృథ్వీరాజు యుద్ధంలో మరణించాడు. రాణి సంయుక్త 1192 వ సం॥ ప్రాణత్యాగం చేసింది. మరు సంవత్సరమే మహమ్మద్ ఘోరీ జయచంద్రుణ్ణి ఘోరంగా హతమార్చాడు.

ఢిల్లీని ఎందరో మహోన్నతంగా పరిపాలించారు. అదేవిధంగా ఎందరెందరో ఆ నగరంపై దండెత్తి దారుణంగా దోచుకున్నారు. అందరికన్నా, పర్షియా నుంచి నాదిర్షా, 1738 వ సం॥ దండెత్తి వచ్చి, మయూరసింహాసనంతోపాటు అనేక ధనరాసులను కొల్లగొట్టుకుని పోయాడు. అంతేకాదు, 30,000 మంది అమాయక ప్రజలను దారుణంగా చంపాడు!

బ్రహ్మాండమైన భవనాలతో, 62 లక్షలకు మించిన జనాభాగల అందమైన ఢిల్లీనగరం ఎంతో శుభ్రంగా వుంటుంది. నగర పరిసర గ్రామాలు కొన్ని కేంద్ర పాలిత ప్రాంతాలుగా ఉంటున్నాయి.




1. 'అలిస్ ఇన్ వండర్‌లాండ్' రచయిత లూయిస్ కరోల్ అసలు పేరేమిటి?
2. వృత్తిరీత్యా అయన ఏం చేసేవాడు?
3. గ్రిమ్ సోదరుల పూర్తి నామాలు ఏవి?
4. చైనా రాజ్యాంగ భాష ఏది?
5. ఆ పదం మాతృక ఏమిటి?
6. ప్రపంచంలో ఉజ్జాయింపుగా ఉన్న భాషలు ఎన్ని?
7. 19వ శతాబ్దంలో రచనావ్యాసంగం ప్రారంభించి 20వ శతాబ్ద మధ్యం వరకు కొనసాగించిన అంగ్ల రచయిత ఎవరు?
8. సాహిత్యంలో నోబెల్ బహుమతి పొందిన ప్రధానమంత్రి ఎవరు?
9. అంగ్ల కవితకు ఆద్యుడుగా చెప్పబడే వారెవరు?
10. అతడు రచించిన గ్రంథం పేరేమిటి?

సమాధానాలు :

ఎవరాయన?
తులసీదాసు

సాహిత్యం

1. చార్లెస్ లుట్‌విడ్జ్ డాడ్గ్‌సన్
2. గణితశాస్త్రాచార్యులు.
3. జాకొబ్‌గ్రిమ్; విల్‌హెల్మ్ గ్రిమ్.
4. మాండేరిన్
5. భారతీయ పదం మంత్రి.
6. దాదాపు పదిహేనువందలు.
7. జార్జ్ బెర్నార్డ్ షా
8. విన్‌స్టన్ చర్చిల్
9. జాఫ్రే ఛాసర్
10. ది కాంటర్‌బరీ టేల్స్



# నెహ్రూ కథ - 9

1929వ సం॥ ఝూరియాలో జరిగిన సమావేశంలో జవహర్‌లాల్ నెహ్రూ ట్రేడ్ యూనియన్ కాంగ్రెస్ అధ్యక్షుడుగా ఎన్నుకోబడ్డాడు. ఆ విధంగా ఆయనకు భారతీయ కార్మికులతో సన్నిహితంగా మెలిగే అవకాశం కలిగింది.

ఆ తరవాత నెహ్రూ లాహోర్ కాంగ్రెస్ సమావేశంలో భారత జాతీయ కాంగ్రెస్ అధ్యక్షుడుగా ఎన్నుకోబడ్డాడు. అప్పుడు ఆయన వయసు నలభై యేళ్ళు. మోతి లాల్ తరవాత అధ్యక్షపదవికి జవహర్ లాల్ పేరును గాంధీజీ ప్రతిపాదించాడు.





లాహోర్ సమావేశంలోనే, పఠాను నాయకుడు ఖాన్ అబ్దుల్ గఫార్‌ఖాన్‌ను అందరూ చూశారు. సరిహద్దు ప్రాంతం నుంచి, చాలామంది యువకులతో వచ్చి ఎంతో ఉత్సాహంగా సమావేశంలో పాల్గొన్న గఫార్‌ఖాన్ అందరి దృష్టినీ ఆకర్షించాడు.



1930వ సం॥ జనవరి 26వ తేదీని 'స్వతంత్రదినం'గా జరుపుకోవాలని కాంగ్రెస్ తీర్మానించింది. ఆ రోజు, దేశ స్వాతంత్ర్యమే ఏకైక లక్ష్యమని నాయకులు ప్రజలకు తెలియజెప్పారు. అసంఖ్యాకమైన ప్రజలు సమావేశాలలో పాల్గొన్నారు.

ప్రభుత్వం ఉప్పు పన్ను విధించడాన్ని గాంధీజీ వ్యతిరేకించి, సత్యాగ్రహానికి పిలుపునిచ్చాడు. అహమ్మదాబాదు సమీపంలోని సబర్మతీ ఆశ్రమంనుంచి, గాంధీజీ ప్రసిద్ధిగాంచిన దండియాత్రను ప్రారంభించాడు. ఇది దేశమంతటా గొప్ప సంచలనాన్ని రేకెత్తించింది.





దేశమంతటా అనేకచోట్ల, ప్రజలు నిషేధాజ్ఞలను అతిక్రమించి సముద్ర తీరాలలోనూ, ఇతర స్థలాలలోనూ ఉప్పు తయారుచేశారు. నెహ్రూ కూడా, కమలా నెహ్రూతోపాటు ఉప్పుసత్యాగ్రహంలో పాల్గొన్నాడు.

1930, ఏప్రిల్ 14 తేదీన, నెహ్రూ రైలు ఎక్కే సమయంలో, పోలీసులు ఆయన్ను ఖైదు చేశారు. ఇది ప్రజలలో మరింత కలవరాన్ని కలుగజేసింది. సత్యాగ్రహం దేశమంతటా ఉధృతంగా వ్యాపించింది.





తను జైలులో ఉన్నప్పుడు, గాంధీజీ కాంగ్రెస్ అధ్యక్ష బాధ్యత వహిస్తే బాగుంటుందని నెహ్రూ ఆశించాడు. కాని గాంధీజీ అందుకు అంగీకరించడని గ్రహించి, తన తండ్రిని అధ్యక్షుడిగా నియమించాడు. మోతీలాల్ అస్వస్థతగా ఉన్నప్పటికీ, తనయుడి బాధ్యతను స్వీకరించాడు.

పలునగరాలలో, విదేశీవస్తు బహిష్కరణ, సహాయ నిరాకరణ ఉద్యమాలు ప్రారంభమయ్యాయి. అనారోగ్యంగా ఉన్నప్పటికీ, ఎండను కూడా లెక్క చేయకుండా, కమలా నెహ్రూ, అక్కడక్కడ జరిగిన సత్యాగ్రహాలకు నాయకత్వం వహించి నడిపించింది.





అలహాబాదులోని తమ గృహం ఆనంద భవన్‌ను దేశానికి అర్పించాలనీ, దానికి స్వరాజ్ భవన్ అని పేరు పెట్టాలనీ మోతీలాల్ నెహ్రూ నిర్ణయించాడు. అందులో ఎక్కువభాగం కాంగ్రెస్ కార్యకలాపాలకు నిలయంగానూ, కొంత భాగం వైద్యశాలగానూ వుండాలని ఆయన ఆశించాడు.

మోతీలాల్ అనారోగ్యానికి గురయ్యాడు. ఆయన ముసూరీకి బయలుదేరడానికి సమాయత్తమవుతూన్న సమయంలో, ఒకనాటి వేకువజామున పోలీసులు ఆయన్ను ఆనందభవన్‌లో ఖైదుచేసి, అతని కుమారుడు బంధించబడివున్న నైనీ జైలుకు తీసుకుపోయారు.





జైలులో వృత్తాకారం గోడగల రెండు గదులస్థలంలో నెహ్రూను ఒంటరిగా ఉంచారు. ఆయన కంటికి దూరంగా కొద్దిపాటి ఆకాశం మాత్రమే కనిపించేది. స్వతంత్రానికి సంకేతంగా కనిపించే ఆ ఆకాశం కేసి, ఆయన అప్పుడప్పుడూ చూస్తూండేవాడు. —(ఇంకావుంది)



# మాటల దుకాణం

పూర్వం ఒక గ్రామంలో ఒక వింత దుకాణం ఉండేది. అది "మాటల దుకాణం". ధర్మపాలుడనే ఒకాయన ఆ దుకాణాన్ని నడిపేవాడు. ఆయన ఒక్కొక్క చీటీ మీద ఒక్కొక్క సలహా రాసిపెట్టి, కావలసిన వారికి కావలసినన్ని సలహాలు అమ్మేవాడు. ఒక్కొక్క చీటీ ఖరీదు నూరు రూపాయలు. ఈ చీట్లు కొన్నవారు వాటిలోని సలహాలు జాగ్రత్తగా పాటించి ఎంతో లాభం పొందుతూండేవారు.

ఒకనాడు ఆ దుకాణానికి ఒక శ్రేష్ఠి వచ్చాడు. ఆయన ధనికుడు. మాటల దుకాణంలో ఆయన మూడు వందలిచ్చి మూడు సలహాలు కొనుక్కున్నాడు. ఆ సలహా లేవంటే:

"ప్రయాణమై వెళ్ళేటప్పుడు భార్యకు వివరాలు చెప్పరాదు."

"దారిలో భోజనం చేయవలసి వస్తే ఎప్పుడుగాని దారికి సమీపంగా భోజనం చెయ్యరాదు."

"తొందరపడి ఎవరితోనూ దేన్ని గురించీ పందెం వెయ్యరాదు."

ఈ సలహాలను కొనుక్కుని శ్రేష్ఠి ఇంటికి వెళ్ళాడు. వీటిలో యథార్థం ఎంత వరకు ఉన్నదీ తెలుసుకోవాలని ఆయనకు కుతూహలం కలిగింది. భార్యతో చెప్పకుండా ఆయన తొమ్మిది సంచులలో తొమ్మిది వేల రూపాయలు తీసుకుని, బండి మాట్లాడుకుని, వ్యాపారం చెయ్యటానికి బస్తీకి బయలుదేరాడు.

శ్రేష్ఠి కొంతదూరం ప్రయాణించాక భోజనం వేళ అయింది. దారికి కొంత దూరంలో బావి కనిపించిన చోట బండి ఆపి, బావి సమీపంలో భోజనంచేసి మళ్లీ ప్రయాణమయాడు. కొద్దిదూరం వెళ్ళాక



ఎంతో కాలంగా మానకుండా ఉన్న పుండు ఒకటి తుడిచిపెట్టినట్టు నయమయింది. ఆ కాయలో ఏదో మహత్తు ఉండి ఉండా లనుకుని, దానిని తిరుగు ప్రయాణంలో తీసుకుపోయే ఉద్దేశంతో, ఆయన బావి సమీపంలో గుర్తుగా ఒకచోట పాతిపెట్టి, బండి ఎక్కి పట్నం కేసి ప్రయాణం సాగించాడు.

బస్తీలో వ్యాపారం బాగా కలిసి వచ్చింది. శ్రేష్ఠి పుష్కలంగా ధనం సంపాదించి, దారిలో తాను దాచిపెట్టిన పుచ్చకాయ మాట మరిచి, మరొక దారిన స్వగ్రామానికి తిరిగి వచ్చాడు.

ఆయన తిరిగి వచ్చేనాటికి ఆ గ్రామం లోని లక్షాధికారి రాచపుండుతో బాధపడు తున్నాడు. ఆ రాచపుండు నయం చేసిన వారికి పదివేల రూపాయలిస్తానని ఆయన చాటింపు వేయించాడు. ఏమంటే, ఎంతో మంది దానికి తగిన చికిత్స చెయ్యలేక పోయారు. ఈ సంగతి వినగానే శ్రేష్ఠికి తాను దాచిన పిచ్చిపుచ్చకాయ జ్ఞాపకం వచ్చింది. అది తెస్తే లక్షాధికారి రాచ పుండు నయమవుతుంది, తనకు పది వేలు లాభం వస్తుంది. ఈ సంతోషంలో ఆయన తాను కొనుక్కున్న సలహాలను మరిచిపోయి, తాను దాచిపెట్టిన పిచ్చి పుచ్చకాయ సంగతి, తాను దాన్ని తీసు

సంచులు లెక్క చూసుకుంటే, తొమ్మిది ఉండవలసినవి ఎనిమిదే ఉన్నవి. బావి వద్దకు వెళ్ళి వెతికితే, పోయిన సంచి దొరికింది. అది అక్కడే ఒక గడ్డి కుప్ప కింద పడి ఉన్నది. తాను డబ్బిచ్చి కొనుక్కున్న సలహాలలో ఒకటి మేలు చేసింది. శ్రేష్ఠి సంతోషించాడు. తాను దారిలోనే భోజనం చేసినట్టయితే ఆ సంచిని దారే పొయ్యే వాళ్ళు ఎవరో ఒకరు తీసుకుని ఉండేవారే.

ఆ సంచి తీసుకుని ఆయన బండి వద్దకు వస్తూండగా ఆయన కాలికి ఒక పిచ్చిపుచ్చకాయ తగిలింది. చిత్రమేమి టంటే, అది తగలగానే ఆయన కాలికి

కొచ్చి చికిత్సచేసి పదివేలు సంపాదించుకునేటందుకు అవకాశం ఉన్న సంగతి భార్యకు చెప్పేసి, "నేను ఇప్పుడే లక్షాధికారి వద్దకు వెళ్ళి ఒప్పందం రాయించుకుని వస్తాను. రేపు బయలుదేరి వెళ్ళి ఆ కాయ తెచ్చుకోవచ్చు." అన్నాడు.

శ్రేష్ఠిగారి భార్య మరుక్షణమే ఈ విషయమంతా పూసగుచ్చినట్టు పొరుగింటి ఆవిడకు చెప్పింది. ఆవిడ తన భర్తకు చెప్పింది. శ్రేష్ఠి లక్షాధికారి ఇంటికి పోయే దారిలో పొరుగింటివాడు వచ్చి ఆయనను కలుసుకున్నాడు. మాటల సందర్భంలో ఇద్దరూ ఒకే పని మీద వెళుతున్నట్టు స్పష్టమయింది.

"ఆ లక్షాధికారి రాచపుండు ఎలా నయమవుతుందో నాకు తప్ప ఇంకెవరికీ తెలియదు." అన్నాడు శ్రేష్ఠి.

"ఆ రహస్యం నాకూ తెలుసును," అన్నాడు పొరుగువాడు.

"లక్షాధికారి పుండు నయం చెయ్యటం నీ వల్ల కాదు." అన్నాడు శ్రేష్ఠి.

"నయం చేస్తాను, చాతనైతే పందెం కాయి!" అన్నాడు పొరుగువాడు.

శ్రేష్ఠి తాను కొనుక్కున్న సలహాలు మళ్ళీ మరిచిపోయి, తన పొరుగువాడు ఆ రాచపుండు నయం చేసే పక్షంలో ఆయన తన ఇంట దేన్ని తాకితే దాన్ని ఇచ్చేస్తానని ఎంతో ఉత్సాహంగా పందెం వేశాడు.



పొరుగువాడు ఆ సాయంకాలమే బయలుదేరి నూతి వద్దకు వెళ్ళి శ్రేష్ఠి దాచిపెట్టిన పిచ్చిపుచ్చకాయను తవ్వి తీసి తెచ్చి, లక్షాధికారి రాచపుండుకు దాన్ని తగిలించి నయంచేశాడు.

శ్రేష్ఠి ఇంకా బయలుదేరక ముందే ఇంతా జరిగిపోయింది. అన్నప్రకారం తన పొరుగువాడు తన ఇంట్లోకి వచ్చి తన ఇనపపెట్టె తాకితే ఏం కాను? తన సంపద వేలకు వేలు అందులో ఉన్నది. తాను సలహాలను పాటించక పోవటం చేతనే ఈ ప్రమాదం వచ్చి పడింది. తాను పుచ్చకాయ కోసం పోబోతున్నట్టు భార్యకు చెప్పాడు; అంతటితో పోనివ్వక తొందరపడి పొరుగువాడితో పందెం వేసుకున్నాడు.

శ్రేష్ఠి పరిగెత్తుకుంటూ మాటల దుకాణానికి వెళ్ళి ధర్మపాలుడి కాళ్ళమీదపడి, జరిగినదంతా చెప్పి, తనకు నష్టం కలగకుండా ఉపాయం చెప్పమన్నాడు.

"జరిగిందేదో జరిగింది. నీ ఇనపపెట్టెను అటకమీద పెట్టించి, పొరుగువాడు వచ్చేసరికి అటకకు నిచ్చెనవేసి ఉంచు. నేను కూడా వస్తాను," అన్నాడు. ధర్మపాలుడు.

పొరుగువాడు శ్రేష్ఠి ఇంటికి వచ్చి, తన పందెం వసూలు చేసుకుంటాడని తెలిసి నలుగురూ పోగయారు. ఆ సాయంకాలం పదిమంది ఎరిగినవాళ్ళను వెంటబెట్టుకుని పొరుగువాడు శ్రేష్ఠి ఇంటిలోపలికి ప్రవేశించాడు. అటూ ఇటూ చూశాడు. ఇనప్పెట్టె కనిపించలేదు. అటకా, నిచ్చెనా కనిపించాయి. ఇనప్పెట్టె అటకమీద ఉన్నది. నిచ్చెన ఎక్కటానికిగాను పొరుగువాడు దాన్ని పట్టుకున్నాడు.

"శ్రేష్ఠి, నిచ్చెన తాకాడు. ఇక అది నీది కాదు. పందెంలో నీవు ఓడావు," అన్నాడు ధర్మపాలుడు.

దీనికి పొరుగువాడు అభ్యంతరం చెప్పాడు. కాని అక్కడ చేరినవారంతా ధర్మపాలుడు చెప్పినది ధర్మమేనన్నారు. ఆయన ధర్మాన శ్రేష్ఠికి పెద్ద నష్టం తప్పింది.





# కృష్ణావతారం

ఉష చూపులు అనిరుద్ధుడి పటం మీద లగ్నమైపోవటమూ, ఆమెకు కలిగిన గగుర్పాటూ గమనించి చిత్రరేఖ చిరునవ్వు నవ్వుతూ "నీకు కలలో కనిపించినవాడెవడో తెలిసిపోయిందిలే. అతను ఎక్కడ ఏ స్థితిలో ఉన్నాసరే, నేను వెళ్ళి అతన్ని తీసుకువచ్చి నీకు అప్పగిస్తాను. ఆ తరవాత నీయిష్టం," అన్నది.

ఉష చిత్రరేఖను చూసి, "నీ నేర్పు ఎలాటిదోగాని, నువు రచించిన ఈ చిత్తరువు చూస్తూంటే, కలలో ఇతన్ని చూసినప్పుడు కలిగిన భావాలన్నీ మళ్ళీ కలిగాయి. ఇతనిది ఏ వంశం? పేరేమిటి? ఎలాటివాడు? ఏం చేస్తూ ఉంటాడు? దయవుంచి కాస్త చెబుదూ!" అన్నది.

దానికి చిత్రరేఖ, "ద్వారకా నగరాన్ని ఏలే కృష్ణుణ్ణి గురించి నువు వినే ఉంటావు. శివుడి కంటిమంటకు ఆహుతి అయిన మన్మథుడే కృష్ణుడికి ప్రద్యుమ్నుడనే కొడుకుగా పుట్టాడని చెబుతారు. ఇతను ఆ ప్రద్యుమ్నుడి కొడుకు. పేరు అనిరుద్ధుడు. అతని శౌర్యం జగత్ప్రసిద్ధమయినది. అతన్ని భర్తగా పొందగలిగితే నీ అదృష్టాన్ని పొగడటం ఆదిశేషుడికి కూడా సాధ్యం కాదు. మన ఈ శోణపురం లాగే ద్వారకానగరం కూడా పరులకు చొరరానిది. అయినప్పటికీ, నీకు సంతోషం కలగగలందులకు, నేను ఏదో ఒక ఉపాయం చేసి అక్కడికి పోతాను. నీ ప్రియుణ్ణి తప్పక తీసుకువస్తాను," అన్నది.



''నీకు ఉపాయాలకు లోటా? యోగ విద్య ఎరిగినదానివి; కామరూపమూ, కామగమనమూ కలదానివి; ఎలాటి పని అయినా సాధించగలవు. ఈ అనిరుద్ధుడి ముఖం నా కళ్ళపడితేనే గాని బతకను, నా ప్రాణాలు కాపాడు. ఇప్పటికే ఏడు రోజులు ఓర్చుకున్నాను. ఇక ఒక్క ఘడియకూడా ప్రాణాలతో నిలవలేను,'' అని ఉష అన్నది.

చిత్రరేఖ ఉషను కౌగలించుకుని, ''నువు వెళ్ళి మిగిలిన చెలికత్తెలతో కాలక్షేపం చేస్తూ ఉండు,'' అని ఆమెను పంపేసి, తాను మరుక్షణమే ఆకాశంలోకి ఎగిరి అంతర్థానమయింది. అలా అంతర్థానమైన చిత్రరేఖ మనోవేగంతో ఒక్క క్షణంలో ద్వారక చేరి, తరవాత ఏం చెయ్యాలా అని చూస్తూండగా, ఒక కొలను దగ్గిర ఆమెకు నారదుడు కనిపించాడు. చిత్రరేఖ మెల్లగా ఆయనను సమీపించి, నమస్కరించింది.

నారదుడు చిత్రరేఖను దీవించి నవ్వుతూ, ''ఏమిటి ఇలా వచ్చావు?'' అని అడిగాడు.

చిత్రరేఖ ఆయనకు, పార్వతీదేవి ఉషకు చెప్పిన మాటలూ, ఆ ప్రకారమే ఉషకు కలలో అనిరుద్ధుడు కనిపించటమూ తాను అనిరుద్ధుణ్ణి తీసుకుపోయి ఉష వద్ద చేర్చటానికి రావటమూ చెప్పి, ''అనిరుద్ధుణ్ణి నేను తీసుకుపోతే బాణుడు ఎలాగూ ఆగ్రహించి, అతనిపై తన ప్రతాపమంతా చూపుతాడు. అందుచేత మీరు కృష్ణుడికి ఈ విషయం కాస్త చెప్పటం అవసరం. బాణుడికీ, కృష్ణుడికీ యుద్ధం జరిగితే ఎలాగూ కృష్ణుడు గెలుస్తాడు. ఆ విషయం నాకు భయం లేదు. నాకు ప్రస్తుతం భయమల్లా, నేను తన మనమణ్ణి తీసుకుపోయానని తెలిసి, కృష్ణుడు నన్ను శపిస్తాడేమోనని. మీరు దయచేసి నాకు కృష్ణుడి భయం లేకుండా చేస్తే మా ఉషాకన్య కోరిక ఈడేరుతుంది,'' అన్నది.

నారదుడు చిత్రలేఖకు తామసి అనే విద్య ఉపదేశించి, "ఈ విద్యద్వారా నీ పని సానుకూలం అవుతుంది. నువు అనిరుద్ధుణ్ణి తీసుకుపోయిన కారణంగా బాణుడితో యుద్ధం జరిగినప్పుడు నే నక్కడికి వచ్చి యుద్ధం నిలుపు చేస్తాను," అని వెళ్ళిపోయాడు.

చిత్రరేఖ అదృశ్యరూపంలో కృష్ణుడి భవనాన్నీ, ప్రద్యుమ్నుడి భవనాన్నీ దాటి, అనిరుద్ధుడి మందిరం చేరి, బంగారు లోటాలతో మధువు తాగుతూ అనేకమంది స్త్రీల మధ్య కూర్చుని ఉన్న అనిరుద్ధుణ్ణి చూసింది. అతన్ని రంజింపజెయ్యటానికి సౌందర్యవతులైన స్త్రీలు ఆడుతున్నారు, పాడుతున్నారు. కాని చిత్రరేఖ అతని కేసి పరీక్షగా చూసి, అతని మనసు అన్యాయత్తంగా ఉండటం గమనించింది. అతను నవ్వితే అది తెచ్చిపెట్టుకున్న నవ్వులాగున్నది. మాట్లాడితే గొంతు గద్గదంగా వినిపిస్తున్నది. అతని ఏ చేష్టలోనూ పూనిక అన్నది లేదు.

"కొంపతీసి ఇతను కూడా ఉషలాగే కలగనలేదు కద! ఇతని మనసును ఆకర్షించగల అందం ఉషకు కాక మరెవతెలో ఉంటుంది? పార్వతీదేవి అనుగ్రహంవల్ల ఏదైనా సాధ్యమే," అనుకున్నది చిత్రరేఖ.

ఆమెకు అతనితో మాట్లాడాలనిపించింది. నారదుడు తనకు ప్రసాదించిన విద్యద్వారా ఆమె అక్కడ ఉన్న మిగతా





వాళ్ళందరినీ మూర్ఛపుచ్చి, అనిరుద్ధుణ్ణి సమీపించి, అతని ఎదట ప్రత్యక్షమై, చేతులు జోడించి, ఇలా అన్నది:

''బలిమహారాజు కొడుకు బాణుడు. ఆయనకు పార్వతీదేవి అనుగ్రహంవల్ల ఒక కుమార్తె కలిగింది. ఆమె పేరు ఉష. ఆమె త్రిలోకైక సుందరి. ఆమె చక్కదనాన్ని బ్రహ్మ కూడా వర్ణించలేడు. నావల్ల ఏమవుతుంది? ఉషాకన్య ఒక రాత్రి నిద్రలో నిన్ను చూసి, అప్పటి నుంచీ నిన్ను పెళ్ళాడాలని సతమత మవుతున్నది. నే నామె చెలికత్తెను, చిత్రరేఖ అనేదాన్ని. నీకు సమ్మతమయిన పక్షంలో నా వెంట నిన్ను తీసుకుపోవచ్చాను. మీ రిద్దరూ ఒకరి కోసం ఒకరు పుట్టారు. సందేహం లేదు. ఇదంతా దైవఘటన. ఇలా జరుగుతుందని పార్వతీదేవి ముందే చెప్పింది. నేను నీ పటం తయారు చేసి చూపి, ఆశరేకెత్తించకపోతే మా ఉష ఏమై ఉండేదో! అనేకమంది భార్యలు గల నీ దారి వేరు. నీ కోసమే అలమటిస్తున్న మా ఉషను కాపాడు. నేను నీకు నమస్కారం చేసి వేడుకుంటున్నాను.''

ఈ మాటలు విని అనిరుద్ధుడు, ''ఏం, చెప్పేది? మీ చెలి కన్న కలే నాకూ వచ్చింది. అది మొదలు నాకు ఏది రాత్రో, ఏది పగలో తెలియటంలేదు. నిద్ర అనేది ఎరగను. నాపాలిటి దేవతలాగా నువు రాకపోతే నాకు ఏం చెయ్యాలో కూడా తెలియదు. నన్ను నువు వేడుకోనవసరం లేదు. ఉష దగ్గిరికి నన్ను నువ్వు తీసుకుపో, నేను వస్తాను,'' అన్నాడు.

ఈ మాటకు చిత్రరేఖ చాలా సంతోషించింది. ఆమె అతని చెయ్యి పట్టుకుని ఆకాశంలోకి లేచి, తనతోపాటు అనిరుద్ధుణ్ణి కూడా అదృశ్యమయేటట్టు చేసింది. మరు క్షణంలో వాళ్ళిద్దరూ శోణపురంలోని ఉష మందిరంలో ఉన్నారు.

ఉషా అనిరుద్ధులు ఒకరి నొకరు ప్రత్యక్షంగా చూసుకున్నారు. ఇద్దరూ ఆనంద పారవశ్యం చెందారు.

''ఇదుగోనమ్మా, నీ ప్రియుడు. నా మాట చెల్లించుకున్నాను. ఇతనికి నీ చెయ్యి ఇచ్చి పాణిగ్రహణం చెయ్యి. గాంధర్వ వివాహం రాజులకు తగినది. దీనికి పార్వతీదేవి కటాక్షం కూడా తోడయింది. ఇక మీరు భార్యాభర్తలు,'' అంటూ చిత్రరేఖ ఉషను కౌగలించుకుని, ఇద్దరికీ కొత్తబట్టలూ, పూలదండలూ, ఆభరణాలూ ఇచ్చింది. అనిరుద్ధుడు ఉష చేతిని తన చేతిలోకి తీసుకుని పాణిగ్రహణం చేశాడు.

కొన్నాళ్ళు ఉషా అనిరుద్ధులు హాయిగా గడిపిన మీదట, వారి రహస్యం అంతఃపురపు కావలివారికి తెలిసింది. వాళ్ళు వెళ్ళి బాణుడితో చెప్పారు. ఎవరో ఒక మానవమాత్రుడు, తన ఖ్యాతినీ, పరాక్రమాన్నీ లక్ష్యపెట్టకుండా, తన యింట ప్రవేశించి. తన వంశానికి మణిపూసలాటి తన కుమార్తెతో కాలం గడుపుతున్నాడనే సరికి బాణుడికి ఆగ్రహం వచ్చింది.

''మీరు వెంటనే వెళ్ళి ఆ దుర్మార్గుణ్ణి పోనీక, చుట్టుముట్టి పట్టుకోండి. నాకు పరాభవం చేసి దేవతలు కూడా ప్రాణాలతో తప్పించుకోలేరు,'' అని బాణుడు తన భటులను హెచ్చరించాడు. వెంటనే కొన్ని వేలమంది రాక్షస కింకరులు కత్తులూ, బాణాలూ పట్టుకుని ఉష అంతఃపురం మీద పడ్డారు.

ఆ కలకలం విని అనిరుద్ధుడు మేడపైభాగం నుంచి, భవనాన్ని చుట్టుముట్టి





ఆమెను చూసి అనిరుద్ధుడు చిరునవ్వు నవ్వుతూ, "పిచ్చిదానా, నా పరాక్రమం నీకు తెలీదు. మీ తండ్రి బలగం మాట చెప్పకు, ఫాలాక్షుడు ప్రమథగణాలతో వచ్చినా గెలవ గలను. నా శత్రువులను నా పిడికిళ్ళతో పొడిచి, నవరంధ్రాలా నెత్తురు కక్కించి, ఈ నగరానికి శోణ పురం అనే పేరు సార్థకమయేటట్టు చేస్తాను. కిటికీ దగ్గిర నిలబడి చూస్తూ ఉండు. భయపడవలసిన పనిలేదు," అన్నాడు.

ఇలా అంటూనే అతను అంతఃపుర ద్వారం వద్ద ఉన్న పరిఘ ఒకటి తీసుకుని, రాక్షసులపైకి వెళ్ళాడు. ఈ సమయంలో నారదుడు వచ్చి, ఆకాశాన నిలబడి వినోదం చూడసాగాడు.

కేకలు పెట్టుతున్న రాక్షసభటులను చూసి, ఒక్క క్షణంలో పోరాటానికి సిద్ధమయే సింహంలాగా అయిపోయాడు.

ఈ లోపల ఉష కన్నీరు కార్చుతూ, చేతులు నలుపుకుంటూ, "కన్యలు చేయకూడని పని చేశాను. కులనాశకురాలిని అయాను. మూడు లోకాలనూ ఏలే తండ్రికి శత్రువునయాను. వెలలేని మాణిక్యంలాటి రాజకుమారుడికి చిక్కు తెచ్చిపెట్టాను. జగదంబ ఇచ్చిన వరం కూడా వృథా అయి పోయేటట్టున్నది. నేనేం చేసేది? అదృష్టదేవతలారా, ఈ ఆపద తప్పించలేరా?" అంటూ దీనంగా ఆక్రోశించింది.

రాక్షసులు అనిరుద్ధుడి మీద బాణాలూ, గదలూ, తమ వద్ద ఉండే సమస్త ఆయుధాలూ ప్రయోగించారు. కాని అతను వాళ్ళను లక్ష్యపెట్టక, తన చేతనున్న పరిఘతో రాక్షసులను ఎడాపెడా చదమసాగాడు; చేతికి అందిన వాళ్ళను పిడికిలితో పొడిచాడు. రాక్షసులలో కొందరు చచ్చారు; కొందరు గాయపడ్డారు; మిగిలినవాళ్ళు పారిపోయి బాణుడి ఎదట నిలబడ్డారు. బాణుడు వాళ్ళను చూసి కోపంతో నానా మాటలూ అన్నాడు:

"శత్రువుకు విజయం ధారపోసి, ప్రాణాలమీది తీపితో పారిపోయి వచ్చారా? శౌర్యపరాక్రమాలు పారిపోయి రావటానికా? ఒకప్పుడు మీ మీద ఆధారపడి లోకాలు జయిస్తినే నాకెంత అవమానం తెచ్చిపెట్టారు! పదండి, మీ వెనకనే రథగజతురగపదాతులనూ, యోధులనూ పంపుతున్నాను. శత్రువు హతమారి తీరాలి," అంటూ బాణుడు కాలకేయులనే రాక్షసులను అనిరుద్ధుడి పైకి పంపాడు. వాళ్ళు భూమ్యాకాశాలు ఆక్రమించి అతడి పైకి యుద్ధానికి వచ్చారు.

రాక్షసులు తన మీదికి యుద్ధానికి వస్తూ ఉండటం గమనించి అనిరుద్ధుడు ఒక కత్తీ, డాలూ తీసుకుని రాక్షసుల పైకి వెళ్ళి, తన కత్తితో శత్రుబలాలను ఊచకోత కొయ్య నారంభించాడు. తాను ఒంటరి అయి ఉండి కూడా, అనేక వేల సంఖ్యగల రాక్షసులతో తలపడి అనిరుద్ధుడు మెరుపు లాగా యుద్ధం చేస్తుంటే నారదుడికి ఆ యుద్ధం అద్భుతంగా కనిపించింది. ఆయన ఎందరో మేటివీరులు పోరాడుతూండగా చూశాడు. అనిరుద్ధుడి లాగా శత్రువులకు దిగ్భ్రమ కలిగించేలాగా యుద్ధం చేసినవాడు ఒక్కడూ లేడు.

బాణుడు పంపిన రాక్షసులు కొందరు చచ్చారు. కంగారులో ఒకరి నొకరు తొక్కుకున్నారు. కొందరు పారిపోసాగారు. అనిరుద్ధుడు పెడబొబ్బలు పెడుతూ వాళ్ళను తరిమికొట్టాడు.

అనిరుద్ధుడి చేత చావుదెబ్బలు తిని పారిపోయి వచ్చిన తన యోధులను చూసేసరికి బాణుడికి ఏదో సంకోచం లాటిది బయలుదేరింది. తన చేతి దెబ్బ తిని, ప్రాణాలతో విడిచిపెట్టబడిన ఇంద్రాదులు ఇప్పటికీ తన పేరు చెబితే వణికిపోతారు. అటువంటిది ఒక అనామకుడు తన బలాలను ఎదిరించి జయించాడు! అది చూసి బాణుడు తానే అనిరుద్ధుడితో యుద్ధం చెయ్యటానికి బయలుదేరాడు.





# వైద్యుడి కీర్తి!

రామాపురంలో రంగదాసనే వైద్యుడుండేవాడు. ఆయన అక్కడ కొంతకాలమున్నాక, అక్కణ్ణించి పట్నానికి మకాం మార్చేశాడు. పట్నంలో వైద్యుడుగా ఆయనకాట్టే పేరు రాలేదు. డబ్బు కూడా రాకపోవడంవల్ల, ఆయన వైద్యం మానేసి చిన్న వ్యాపారం ప్రారంభించాడు. వ్యాపారంలో ఆయనకు బాగా కలిసివచ్చింది. కొద్దికాలంలోనే వ్యాపారిగా స్థిరపడ్డాడాయన.

అలా కొన్నేళ్ళు గడిచాయి.

ఒక రోజున పని మీద రంగదాసు పొరుగూరు బయల్దేరాడు. ఊరి పొలిమేర చేరుకున్నాక, ఆయనను కొందరు దొంగలు దోచి కట్టుబట్టలు కూడా లాక్కుని వెళ్ళిపోయారు. ఆయన కట్టుకునేందుకు తమ దగ్గిరున్న మాసినబట్టలు వదిలారువాళ్ళు.

చేసేదిలేక రంగదాసు, దొంగలు వదిలిన మాసిన బట్టలు కట్టుకుని ఊళ్ళోకి వెళ్ళాడు. ఆ ఊళ్ళో ఆయననెరిగున్న వాళ్ళెవరూ లేరు. ఊళ్ళో వచ్చిన పని కావడానికీ, తిరిగి వెళ్ళడానికీ ఆయనకు కొంత డబ్బు కావాలి. కానీ ఆయన వేషం చూసి ఎవరూ పెద్ద వ్యాపారి అని నమ్మడం లేదు.

చివరకు రంగదాసు ఒక వ్యాపారి దగ్గిరకు వెళ్ళి, "అయ్యా, యీ ఊళ్ళో కొత్తరకం బియ్యం దొరుకుతుందని నేను పట్నం నుంచి వచ్చాను. అనుకోకుండా దొంగలు, నామీదపడి నాకీగతి పట్టించారు. పట్నంలో నేను మంచి పేరున్న వ్యాపారిని. ఇక్కడ బియ్యం కొనుగోలులో నాకు సాయపడి, నాతోపాటు పట్నంరండి. మీ సాయానికి రెట్టింపు ప్రతిఫలం యివ్వగలను," అన్నాడు.

శ్రీరామకమల్

దానికి వ్యాపారి, ''ఈ రోజుల్లో ముక్కూ మొహం తెలియని వాళ్ళను నమ్మ డబ్బివ్వలేం. అయినా పట్నంలో కొందరు వ్యాపారులు నాకు తెలుసు. మీ పేరు చెప్పండి,'' అన్నాడు.

''నా పేరు రంగదాసు,'' అన్నాడు రంగదాసు.

''రంగదాసా? ఆ పేరు గల వ్యాపారు లెవరూ నాకు తెలియదు,'' అన్నాడు వ్యాపారి పెదవి విరిచి.

''అయ్యా, బాగా ఆలోచించండి. మరొక సారి గుర్తు చేసుకోండి. పట్నంలో నాకు అంతోయింతో పేరున్నది. నా పేరు రంగ దాసు. మీరాపేరు వినేవుంటారు,'' అన్నాడు రంగదాసు దీనంగా.

వ్యాపారి ఒకటి, రెండు క్షణాలు మౌనంగా వుండి, ''రంగదాసు....రంగ దాసు! ఈ పేరు ఎక్కడో విన్నట్టుంది,'' అన్నాడు.

''చెప్పానుగా, పట్నంలో నాకు బాగా పేరున్నది,'' అన్నాడు రంగదాసు ఉత్సాహంగా.

వ్యాపారి చటుక్కున, ''ఆఁ, గుర్తు కొచ్చింది. నేను విన్న రంగదాసు పేరు పట్నం వ్యాపారిది. రామాపురంలో ఏ ఇంట విన్నా, ఆ పేరే! ఆ రంగదాసు వైద్యుడు,'' అన్నాడు.

దీనికి రంగదాసు ఆశ్చర్యపడి, ''అయ్యా, ఒకప్పుడు నేను వైద్యుణ్ణి. రామాపురంలో వుండేవాణ్ణి. తర్వాత



అక్కణ్ణించి పట్నానికి వెళ్ళిపోయాను. వైద్యవృత్తి లాభసాటిగా లేక, వ్యాపారం ప్రారంభించి అందులో పైకి వచ్చాను. ఇది జరిగి చాలాకాలమయింది. నాకు వైద్యం తెలుసునన్న విషయం నేనే మరిచిపోయాను. ఇంకా రామాపురంలో నా పేరు గుర్తుంచుకున్నారంటే ఆశ్చర్యంగా వున్నది. తమరు రామాపురం వెళ్ళి ఎంత కాలమయిందో చెప్పగలరా?'' అని అడిగాడు.

''ఈ మధ్యనే, నా చెల్లెలి పెళ్ళయింది. అత్తవారిది రామాపురం. నా చెల్లెల్ని అక్కడ దిగబెట్టడానికి రెండు వారాల క్రితం రామాపురం వెళ్ళాను. అప్పుడే మిమ్మల్ని గురించి విన్నాను. అక్కడ మీ పేరు వినబడని ఇల్లు లేదంటే నమ్మండి,'' అన్నాడు వ్యాపారి.

రంగదాసు సమస్య తీరిపోయింది. రామాపురం వెళ్ళివచ్చినప్పటి నుంచీ రంగదాసును చూడాలని, ఆ వ్యాపారి ఎంతగానో కుతూహలపడుతున్నాడట. తన కోరిక తీరినందుకు సంతోషించి, ఆ వ్యాపారి రంగదాసుకు కట్టుకోవడానికి మంచి బట్టలిచ్చి, తృప్తిగా భోజనం పెట్టి అవసరం అయిన ధన సాయం కూడా చేశాడు. తర్వాత రంగదాసు వెంట పట్నంవెళ్ళి, తను యిచ్చిన డబ్బు తీసుకుని వెళ్ళిపోయాడు.

రంగదాసు, భార్యకు జరిగిందంతా చెప్పి, ''రామాపురం వదిలి మనం పార



పాటు చేశామేమోననిపిస్తున్నది. అక్కడ మనకున్న పేరు అంతాయింతా కాదు. నువ్వేమో నన్నాఊరు వదిలేదాకా ప్రాణాలు తీశావు. పట్నం వచ్చాక ఒక్కసారి కూడా నన్నాఊరు వెళ్ళనివ్వలేదు. ఇప్పుడు విషయం తెలిసింది కాబట్టి, నేనా ఊరు వెళ్ళకుండా వుండలేను. మనం సకుటుంబంగా రామాపురం వెళ్ళి, కొన్నాళ్ళుండి వద్దాం,'' అన్నాడు ఎంతో ఉత్సాహంగా.

అందుకు రంగదాసు భార్య, ''మీకక్కడున్న పేరు మొదటినుంచీ, నాకు తెలుసు. నా మాట వినండి. మనం అక్కడికి వెళ్ళ వద్దు,'' అన్నది.

''ఇన్నాళ్ళూ నీ మాట విన్నాను. ఇక వినను. నాకు రామాపురంలో వున్న పేరు గురించి తెలిస్తే, యిన్నాళ్ళు ఎందుకు చెప్పలేదు? నాకు పేరు రావడం, నీకిష్టం లేదా?'' అన్నాడు రంగదాసు కోపంగా.

''అదేంకాదు. రామాపురంలో మీకు బొత్తిగా వైద్యం తెలియదని పేరున్నది. మీ దగ్గిర మందు రుచి కాళకూట విషాన్ని మించినదట. ఎవరికైనా మరొకరిమీద కోపంవస్తే, 'నీకు రంగదాసు చేత వైద్యం చేయిస్తాను', అనేవారు. తల్లులు బిడ్డలను కసిరేటప్పుడు, 'వెధవా, యిందాకట్నుంచి దగ్గుతున్నావు. కరక్కాయ నోట్లో పెట్టుకుంటావా? రంగదాసు దగ్గిరకు వైద్యానికి పంపనా?' అనేవారు. ఇలా నలుగురూ మిమ్మల్ని వేళాకోళం చేస్తూంటే, నాకేదో బాధగా అనిపించి అక్కడ వుండలేక పట్నానికి ప్రయాణం కట్టించాను. ఇన్నాళ్ళూ మీరు బాధపడతారని అసలు విషయం చెప్పలేదు. ఆ ఊరువదిలి యిన్నేళ్ళయినా, యింకా మిమ్మల్ని వేళాకోళం చేయడం, ఆ ఊరివాళ్ళు మానలేదన్నమాట! ఏం మనుషులు!'' అన్నది రంగదాసు భార్య బాధగా.

ఇది విన్న రంగదాసు రామాపురమే కాదు, తనకు సాయంచేసిన వ్యాపారి వున్న పొరుగూరు కూడా ఎన్నడూ వెళ్ళలేదు.





# దాచిపెట్టిన వీలునామా

[గత సంచిక తరువాయి]

ఏళ్ళు దొర్లిపోయాయి. షాన్-షూ పద్నాలుగేళ్ళవాడయ్యాడు. ఒకనాడు వాడు తన తల్లితో, "అమ్మా, నాకు సిల్కుబట్టలు కుట్టించు," అన్నాడు. డబ్బు లేదన్నది తల్లి. "మా నాన్న రాజప్రతినిధి. ఉన్నది ఇద్దరమే కొడుకులం. అన్నకు అంత డబ్బుంటే నాకు కొత్తబట్టలకు డబ్బెందుకు లేకపోవాలి? నీ దగ్గిర లేకపోతే అన్న నడుగుతాను," అన్నాడు.

తల్లి అలా ఎన్నడూ చెయ్యవద్దన్నది. అందుకని వాడు ఒకనాడు తల్లికి తెలియకుండా అన్నవద్దకు వెళ్ళి, "నాన్న చాలా గొప్పవాడు. నేను వేసుకునే నాసిరకం బట్టలు చూసి అందరూ నవ్వుతున్నారు. అన్నా, నాకు కొంత సిల్కు ఇప్పించు, కొత్తబట్టలు కుట్టించుకుంటాను," అన్నాడు.

"కొత్తబట్టలు కావాలంటే మీ అమ్మ నడుగు!" అన్నాడు షాన్-చీ.

"ఆస్తి చూస్తున్నది నువే కద, మా అమ్మ కాదే!" అన్నాడు షాన్-షూ.

"వెధవా, నువు బట్టలడగవచ్చావా? భాగం అడగవచ్చావా? ఆస్తి నాదీ, నా పిల్లలదీనూ! మధ్య నువ్వెవడివి?" అంటూ తమ్ముడి నెత్తిన గట్టిగా మొట్టాడు షాన్-చీ.

నెత్తి బొప్పికట్టి, ఏడుస్తూ కుర్రవాడు తల్లి దగ్గిరికి పోయి జరిగిన సంగతి చెప్పాడు.

"వెళ్ళవద్దంటిని కదా, నీకు జరగవలసిందే!" అంటూనే తల్లి తన కొడుకు తల నిమిరి, తన కన్నీళ్ళతో తడిపింది. తరవాత ఆమె షాన్-చీకి క్షమాపణ చెప్పిరమ్మని దాసీని పంపుతూ, "తెలియక కుర్రవెధవ అన్న మాటలకు కోపం తెచ్చుకోవద్దు," అని చెప్పి పంపించింది.



వారిది. నాన్నగారు వీలునామాలో రాసినది తూచా తప్పటంలేదు. ఇందుకు మీరే సాక్షులు,'' అంటూ తనకు తండ్రి ఇచ్చిన పుస్తకం చూపాడు.

ఇందుకు అందరూ సమ్మతించారు. కొందరికి ఇది అన్యాయమని తోచికూడా అభ్యంతరంచెప్పక, "చాతయినవాడెవడూ తండ్రి ఆస్తి తింటూ కూచోడు. కష్టపడి పని చేసేవాడికి కరువుండదు. ఏమీ లేకుండా జీవితం ఆరంభించి, లక్షాధికార్లయినవాళ్లు న్నారు,'' అన్నారు.

తరవాత తల్లీకొడుకులు తమకున్న కొద్ది సామాన్లతో తూర్పు ఇంటికి వెళ్లిపోయారు. అది చాలా పాత ఇల్లు, చాలా గదులు కురుస్తాయి. ఒకటి రెండు మంచి గదులు శుభ్రం చేసుకుని వారు వాటిలోనే కాలక్షేపం చేయసాగారు. వారి వంతు వచ్చిన భూమికూడా వట్టి పత్ర. పంటలు పాడైన ఏడు అందులో నుంచి చల్లినన్ని గింజలుకూడా రావు.

కొద్దికాలం గడిచింది. వారుండే గ్రామానికి ఒక కుశాగ్రబుద్ధి అయిన న్యాయాధికారి కొత్తగా వచ్చినట్టు మేయ్‌కి తెలియవచ్చింది. ఆ గ్రామంలో కొంతకాలం క్రితం ఒక దర్జీవాణ్ణి ఎవరో హత్యచేశారు. దర్జీవాడి భార్య గ్రామంలోని ఒక మనిషిపైన హత్యానేరం మోపి పాత న్యాయాధికారివద్ద ఫిర్యాదు చేసింది. ఆ న్యాయాధికారి ఆ

అయినప్పటికీ షాన్-చీ కోపం చల్లారక మర్నాడు ఉదయం తన బంధువుల నందరినీ పిలిపించి, మేయ్ షాన్-షూల ఎదట వారితో, '' పెద్దలందరూ చిత్తగించాలి. షాన్-షూనూ, అతని తల్లినీ పోషించటం నాకిష్టం లేదనుకోకండి. వాళ్ళని వెళ్ళగొట్టాలనే ఉద్దేశంకూడా నాకు లేదు. కాని నిన్న షాన్-షూ వచ్చి నాతో ఆస్తి గురించి తగాదా పెట్టాడు. ఇప్పుడే ఇలా ఉంటే, ముందేంచేస్తాడో చెప్పలేం. అందుచేత వారికి మీ అందరి ఎదటా మా నాన్నగారు రాసిపెట్టిన ప్రకారం వంతు ఇచ్చేస్తాను. తూర్పువేపున ఉన్న ఇల్లూ, ఇరవైతొమ్మిది కుంటల పొలమూ ఇకనుంచీ

ఆరోపణను నమ్మి ముద్దాయికి మరణశిక్ష విధించాడు. ఇంతలో ఈ కొత్త న్యాయాధికారి వచ్చి, అసలు హంతకుణ్ణి యుక్తిగా కనిపెట్టి, నిర్దోషి అయిన ముద్దాయిని విడిచిపెట్టాడు. ఆయనను అందరూ మెచ్చుకున్నారు.

అలాటి వాడి ద్వారానే తనకూ, తన కొడుక్కూ న్యాయం జరగాలనుకుని, తన భర్త చిత్తరువు తీసుకునివెళ్ళి న్యాయాధికారికిస్తూ, "పాన్-చీ నా భర్త ఆస్తి అంతా స్వాధీనపరుచుకుని నా కొడుక్కు సగభాగం ఇవ్వటంలేదు. తమరు న్యాయం జరిపించాలి. పోయేటప్పుడు నా భర్త ఈ చిత్తరువును నాకిచ్చి, తన అసలు వీలునామా రహస్యం ఇందులో ఉందనీ, తెలివైన న్యాయాధికారి ఆ రహస్యం తెలుసుకోవచ్చుననీ అన్నారు,'' అన్నది.



న్యాయాధికారి ఆమెను పంపేసి చిత్తరువుకేసి చాలాసేపు చూశాడు, కాని ఆయనకేమీ బోధపడలేదు. చివరకాయన గుడ్డకు అంటించి ఉన్న బొమ్మను ఊడదీయగా, బొమ్మచాటున ఒక కాగితంలో ఇలా రాసి ఉన్నది: ''నేను వృద్ధుణ్ణి. నా రెండవ కొడుకు పాన్-షూ పసివాడు. నా పెద్ద కొడుకు పాన్-చీ దుర్మార్గుడు. వాడు తమ్ముడికి ద్రోహం చెయ్యవచ్చు. నా పొలాలూ, రెండు భవంతులూ పాన్-చీకి ఇచ్చివేస్తున్నాను. తూర్పున ఉన్న ఇల్లు పాన్-షూకు చెందవలెను. ఈ ఇల్లు పాతదైనప్పటికీ దీని యొక్క తూర్పుగోడకింద అయిదు జాడీలలో ఇరవైమణుగుల బరువుగల వెండీ, పడమటి గోడకింద అలాగే అయిదు జాడీలలో ఇరవైమణుగుల వెండీ, ఆరవజాడీలో నాలుగుమణుగుల బంగారమూ ఉన్నది. భూమికి ప్రత్యామ్నాయంగా ఈ వెండి బంగారాలు నా చిన్నకొడుకైన పాన్-షూకు చెందవలెను.''

దీనిపైన ముసలివాడి సంతకమూ, తేదీ ఉన్నాయి.

మర్నాడు న్యాయాధికారి పాన్-చీని పిలిపించాడు. ఆయన అతడితో, ''నీపైన మీ



సవతితల్లి ఫిర్యాదు తెచ్చింది. నువు మీ సవతి తమ్ముడికి సక్రమంగా నీ తండ్రి ఆస్తిలో భాగం పంచలేదట. ఆ సంగతి నిజమేనా?'' అన్నాడు.

''ప్రభువులు చిత్తగించాలి. నావద్ద మా తండ్రిగారి వీలునామా ఉన్నది. అందులో ఆయన నా తమ్ముడికి ఏమేమి ఇవ్వమని రాశారో అదంతా ఇచ్చేశాను. ఆ వీలునామాను తమరుకూడా చిత్తగించవచ్చు.'' అన్నాడు షాన్-చీ.

''సరే, రేపు ఉదయం నేను మీ ఇంటికి వచ్చి మీ తండ్రిగారి వీలునామా స్వయంగా చూశాక తీర్పు ఇస్తాను.'' అన్నాడు న్యాయాధికారి. ఆయన షాన్-చీని పంపేసి, మర్నాడు ఉదయం షాన్-చీ ఇంటివద్ద కొడుకుతోసహా హాజరు కావలిసిందని మేయ్‌కి వర్తమానం పంపాడు.

షాన్-చీ మర్నాడు ఉదయం తన ఇంటి చావడి చక్కగా అలంకరించి, న్యాయాధికారి కూర్చోటానికి ఒక కుర్చీ మీద పులితోలు పరిపించి, తన బంధువులనందరినీ పెందలాడే రమ్మని కబురు పెట్టాడు. వారంతా వచ్చారు.

త్వరలోనే మేనాకుర్చీ ఎక్కి, భటులను వెంటబెట్టుకుని, న్యాయాధికారి వచ్చాడు. బోయీలు మేనాకుర్చీని వాకిలి దగ్గిరగా దించారు. న్యాయాధికారి వాకిలి దాకా వచ్చి, ఎవరో కనిపించినట్టుగా వంగి మర్యాదచేసి, లోపలికి దారి చూపుతూ, ''దయచెయ్యండి!'' అన్నాడు. అ తరవాత ఆయన ఎవరినో వెంటపెట్టుకుని వచ్చేవాడిలాగా మాట్లాడుతూ లోపలికి వచ్చి, ఆ కనపడని వ్యక్తికి పులితోలు కుర్చీ చూపించి, ''ఆ ఆసనం అలంకరించండి!'' అంటూ తాను మరొక కుర్చీలో కూచున్నాడు. ఆయన ఇంకా ఎవరితోనో మాట్లాడుతున్నట్టుగా, ''భార్యగారు నావద్ద ఫిర్యాదు తెచ్చింది. ఆ విషయం ఎలా పరిష్కరించమని తమ సలహా? అలాగా? మీ

పెద్దబ్బాయి ప్రవర్తన ఏమీ బాగాలేదే! మీ చిన్నకుమారుడికి ఏమి ఇద్దామను కున్నారు? తూర్పు ఇల్లా? మరి అతను బతికే ఉపాయం?....అలా చెప్పండి! చిత్తం, అలాగే చేస్తాను. అదంతా మీ చిన్నవాడికేనా? మీరు చెప్పినదంతా నేను అమలుజరిపిస్తానులెండి!'' అన్నాడు.

న్యాయాధికారి ఏదో దయ్యంతోమాట్లాడు తున్నాడనుకుని అక్కడ చేరినవారంతా కంగారుపడ్డారు. వారాయనను పలకరించ టానికే భయపడ్డారు. చివరకాయన లేచి నిలబడి వంగి, ''సరే ఇక నాకు సెలవిప్పి స్తారా?'' అని మళ్ళీ నిటారుగా నిలబడి ఆశ్చర్యంతో చుట్టూ కలయజూశాడు. తర వాత ఆయన షాన్-చీ కేసి తిరిగి, ''ఇప్పుడు నాతో మాట్లాడుతున్నారు, ఇంతలో మీనాన్న గారు ఎటు వెళ్ళారు? మా సంభాషణ నువు విన్నావుగా?'' అన్నాడు.

''నేను వినలేదు, అంతా ఆశ్చర్యంగా వుంది,'' అన్నాడు షాన్-చీ.

''ఎత్తు మనిషి, కోలమొహం, దవడ ఎముకలు ఎత్తుగా ఉంటాయి, బాదంకాయ కళ్ళు, పొడుగాటి కనుబొమలు, పెద్ద చెవులు, పలచ పలచని తెల్ల గడ్డం, అధి కారులు ధరించే టోపి పెట్టుకున్నారు, నల్లటి బూట్లు, ఎర్రని లుంగి, నడుముకు బంగారు పట్టీ పెట్టుకున్నారు. ఆయన రాజప్రతినిధి ''నీ'', యేగా?'' అన్నాడు న్యాయాధికారి.



''బతికుండగా అచ్చు అలాగే ఉండే వారు,'' అన్నారు బంధువులు. న్యాయాధికారి వర్ణించింది చిత్తరువు ఆధారంతో. కాని ఆసంగతి ఎవరికీ తెలియదు. చచ్చిపోయిన మనిషి కనిపించాడనే అనుకున్నారు.

''మీకు రెండిళ్ళూ, తూర్పున మరొక ఇల్లూ ఉందటగా. ఆ ఇంటిదగ్గిరికి పోదాం. అక్కడ మిగిలిన విషయాలు చెబుతాను,'' అన్నాడు న్యాయాధికారి. షాన్-చీ ఆయనను వెంటబెట్టుకుని తూర్పు ఇంటికి వెళ్ళాడు.

''ఈ ఇల్లు మీతమ్ముడికివ్వటం సమ్మతమేనా?'' అని న్యాయాధికారి అడిగాడు.

షాన్-చీ, ''చిత్తం! చిత్తం!'' అన్నాడు.

న్యాయాధికారి ఆ ఇంటి మధ్యగదిలో కూచుని పుస్తకం తిరగవేసి, ''ఇందులో అంతా స్పష్టంగానే ఉన్నది. షాన్-షూకు ఇంతకంటె మరేమీ రాదు,'' అన్నాడు.

మేయ్ దుఃఖంతో కుమిలిపోయి, తన కొడుక్కు న్యాయం జరగదనుకున్నది.

''అయితే ఈ ఇంట్లో నలభై మణుగుల వెండీ, నాలుగు మణుగుల బంగారమూ పాతిపెట్టి ఉన్నట్టు మీ నాన్నగారింతకు ముందే నాతో చెప్పారు. అది కూడా షాన్-షూకే చెందుతుంది,'' అన్నాడు న్యాయాధికారి. ఈ మాటను షాన్-చీ నమ్మలేదు. అతను ''ఎన్ని మణుగులున్నా అది షాన్-షూ సొత్తే. నేనభ్యంతరం పెట్టను,'' అన్నాడు.

"పెడితే నేను ఊరుకుంటానా ఏమిటి?" అంటూ న్యాయాధికారి తూర్పుగోడకింద తవ్వించాడు. అయిదు జాడీలనిండా వెండి బయటపడింది. అలాగే పడమటి గోడకింద తవ్వగా మరో అయిదు జాడీలలో వెండీ, ఆరవజాడీలో బంగారమూ బయటపడింది.

న్యాయాధికారి ఆ వెండి బంగారాలను షాన్-షూ పరంచేశాడు. తన తమ్ముడితో తండ్రి ఆస్తి సవ్యంగా పంచుకున్నట్టయితే ఆ వెండి బంగారాలలో తనకు సగంవాటా వచ్చేదిగదా అని షాన్-చీ ఎంతో కుమిలిపోయాడు.



## గాఢనిద్ర



ఆస్ట్రేలియాకు చెందిన రాత్రుల్లో సంచరించే ఫ్రాగ్ మవుత్ అనే పక్షి పగటిపూట ఒళ్ళుమరచి నిద్ర పోతుంది. ఆ పక్షి నిద్రపోయేప్పుడు దానిని ఆ చోటు నుంచి అమాంతం తీసి మరో చోటికి మార్చినా అది మేలుకోదు !

## రాక్షసబల్లి పెద్ద గుడ్డు

ఇంతవరకు లభించిన రాక్షసబల్లి గుడ్లలోకెల్లా చాలా పెద్దవి ఫ్రాన్స్‌లో కనుగొనబడినవి. 3.3 లీటర్లు పట్టగల ఈ గుడ్లను, 80,000,000 సంవత్సరాలకు పూర్వం నివసించిన 30 అడుగుల రాక్షసబల్లి పెట్టి వుంటుందని భావిస్తున్నారు.



డినోజార్ గుడ్డు పక్కన మామూలు కోడిగుడ్డు

## అగ్నిపర్వతాలు




ప్రపంచం మొత్తం మీద 455 అగ్ని పర్వతాలు ఉన్నాయి. ఇవి గాక 80 సముద్రం అడుగున ఉన్నాయి. ఇండోనేషియాలో మాత్రం ముఖ్యమైన చారిత్రక సమయాలలో ప్రేలిన దాదాపు 167-77 అగ్నిపర్వతాలు ఉన్నాయి !

# ఫోటో వ్యాఖ్యల పోటీ : : బహుమానం రు. 50 లు

ఈ ఫోటోల వ్యాఖ్యలు 1989 నవంబర్ నెల సంచికలో ప్రకటింపబడును.



M. C. Morabad



Devidas Kasbekar

★ పై ఫోటోలకు సరియైన వ్యాఖ్యలు ఒక్కమాటలో గానీ, చిన్న వాక్యంలోగానీ కావాలి. (రెండు వ్యాఖ్యలకూ సంబంధం ఉండాలి.) ★ సెప్టెంబర్ నెల 15వ తేదీలోగా వ్యాఖ్యలు మాకు చేరాలి. ★ మాకు చేరిన వ్యాఖ్యలలో అత్యుత్తమంగా ఉన్న సెట్టుకు (రెండు వ్యాఖ్యలకు కలిపి) రు. 50/–లు బహుమానం. ★ వ్యాఖ్యలు రెండూ పోస్టుకార్డుపైన రాసి, ఈ అడ్రసుకు పంపాలి:– చందమామ ఫోటో వ్యాఖ్యల పోటీ, మద్రాసు-26

---

## జూలై నెల పోటీ ఫలితాలు

మొదటి ఫోటో: శ్రమ ఫలిస్తుంది!

రెండవ ఫోటో: నేర్పు రాణిస్తుంది!!

పంపినవారు: పి. కాంతినిర్మల, శివాలయం వీధి, మార్టేరు—534 122

బహుమతి మొత్తం రు. 50/– నెలాఖరులోగా పంపబడుతుంది.


## చందమామ

ఇండియాలో సంవత్సర చందా: రూ. 36-00

చందా పంపవలసిన చిరునామా:

డాల్టన్ ఏజన్సీస్, చందమామ బిల్డింగ్స్, వడపళని, మద్రాసు-600 026.

ఇతర దేశాల చందా వివరాలకు రాయండి:

చందమామ పబ్లికేషన్స్, చందమామ బిల్డింగ్స్, వడపళని, మద్రాసు-600 026.

Printed by B.V. REDDI at Prasad Process Private Ltd., 188 N.S.K. Salai, Madras 600 026 (India) and Published by B. VISHWANATHA REDDI on behalf of CHANDAMAMA PUBLICATIONS, Chandamama Buildings, Vadapalani, Madras 600 026 (India). Controlling Editor: NAGI REDDI.


---

